# వేసవి కాలపు మీ విశ్రాంతి
# కేవలం కొద్ది గంటల దూరంలోనే ఉంది.

భారత దేశంలోని ప్రతీ ప్రాంతం కూడా వేయి వసంతాల శోభతో మీకు ఆనందం కలగజేస్తుంది కొద్ది గంటలలోనే అక్కడకు చేరుకోవచ్చు—విమానం ద్వారా



## ఉత్తరం

**కాశ్మీర్** నిజమయిన భూతల స్వర్గం ఇళ్ళ పడవలతో, అపురూపమయిన షికారీలతో, నీటిపైన స్కీయింగ్ క్రీడకు చక్కటి చోటు హిమాలయాల సుందర దృశ్యాల గురించి వేరే చెప్పవలసిన అవసరం లేదు అతి దగ్గరలోని విమానాశ్రయం శ్రీనగర్

**డల్‌హౌసి** హిమాలయాల ప్రారంభంలో అందంగా నెలకొన్న నగరం చల్లటి ప్రశాంత విశ్రాంతికి చక్కటి స్థలం అతి దగ్గరలోని విమానాశ్రయం జమ్ము

**మసూరి** ఉ ప్ర కొండలకు ప్రశాంత ముఖద్వారం షికారుగా దూరాలు నడవటానికి అనువుగా ఉంటుంది ఇక్కడి రోప్ మార్గం ఒక ప్రత్యేకత అతి దగ్గరలోని విమానాశ్రయం ఢిల్లీ

## దక్షిణం

**ఉదకమండలం** నీలగిరులలోని ఆహ్లాదకరమయిన పర్వత విశ్రాంతి కేంద్రం యూక్లిప్టస్ వృక్షాల సంపద అపారం అతి దగ్గరలోని విమానాశ్రయం కోయంబత్తూరు

**బెంగుళూరు** 900 మీటర్ల ఎత్తున గల అందమయిన ఉద్యానవన నగరం ఇక్కడ మకాం పెట్టుకొని కర్నాటక చుట్టు ప్రక్కల సుందర ప్రదేశాలను, కట్టడాలను చూడవచ్చు కారులో జోగ్ జలపాతం, ఉదకమండలం వెళ్ళిరావచ్చు ఇక్కడ నుంచి మిగతా భారతదేశానికి విమాన సర్వీసులున్నాయి

**హార్స్‌లే కొండలు** నిర్మలమయిన పర్వత విశ్రాంతి కేంద్రం చుట్టూ ప్రశాంతమైన ఎర్ర చందనం, యూక్లిప్టస్ తోటలు అతి దగ్గరలోని విమానాశ్రయం బెంగుళూరు లేదా తిరుపతి

## తూర్పు

**డార్జిలింగ్** ప్రశాంతమయిన ఈ ప్రదేశం నుంచి హిమాలయాల సుందర దృశ్యాలు లెక్కలేనన్ని ఇక్కడి నుంచి కాలింపాంగ్, సిక్కిం కూడా వెళ్ళవచ్చు. అతి దగ్గరలోని విమానాశ్రయం బాగ్‌డోగ్రా.

**షిల్లాంగ్** పైన్ చెట్ల సుగంధం ఆస్వాదిస్తూ షికారు తిరగవచ్చు అద్భుతమైన గోల్ఫ్ కోర్సులు, పర్వత దృశ్యాలు అతి దగ్గరలోని విమానాశ్రయం గౌహతి.

**ఇంఫల్** చెట్లతో నిండిన పర్వతాలు, సరస్సుల మధ్య వున్న అందమైన ప్రదేశం నిత్యం పచ్చగా ఉండే లోయ ఇక్కడి విమానాశ్రయం నుంచి భారత దేశంలోని ఏ ప్రాంతానికయినా వెళ్ళేందుకు అనువయింది

## పశ్చిమం

**సపుతరా** 1000 మీటర్ల ఎత్తున గల ఆనందదాయకమైన పర్వత విశ్రాంతి కేంద్రం చక్కటి వాతావరణం. ఉత్తేజాన్ని కలిగించే సుందర దృశ్యాలు అతి దగ్గరలోని విమానాశ్రయం అహ్మదాబాదు

**మహాబలేశ్వర్** 1500 మీటర్ల ఎత్తున మరాఠా కోట ఉంది రాతి దేవాలయాలు, ఉల్లాసంగా ఉండే వాతావరణం అతి దగ్గరలోని విమానాశ్రయం బొంబాయి

**మౌంట్ అబు** అపూర్వమైన పర్వత విశ్రాంతి కేంద్రం. నక్కి సరస్సు, గోముఖ్, సూర్యాస్తమయ సుందర ప్రదేశం. అతి దగ్గరలోని విమానాశ్రయం అహ్మదాబాదు

**ఎక్కడనుంచి అయినా కొద్దిసేపు విమాన ప్రయాణమే**

ఇండియన్ ఎయిర్‌లైన్స్, అతి వేగంగా వెళ్ళే, అధునాతన విమానాలతో దేశమంతటా వున్న సర్వీసులతో మిమ్మల్ని ప్రతీ చోటుకు తీసుకు వెడుతుంది

**మీ ట్రావెల్ ఏజెంట్ అన్ని ఏర్పాట్లతో మీకు సహాయపడతారు.**

**ఏలు ప్రదేశాలకు**
**IA ద్వారా**
**ప్రయాణం చేయండి**

**ఇండియన్ ఎయిర్‌లైన్స్**

గోద్రెజ్ నుంచి కొత్తది

# మహత్తర శక్తిగలది

# కీ

నీలిరంగు డిటర్జెంట్
ఉతికే పౌడర్—
అమోఘ చర్యతో
కాంతివంతం చేసేది




**అద్భుతమైన మెరుపు**

మహత్తరమైన శక్తి గల కొత్త 'కీ' బట్టలను మరింత తెల్లగా, కాంతివంతంగా ఉతుకుతుందని లేబొరేటరీలో చేసిన పరీక్షలు నిరూపించాయి. ఎందుకంటే, కీలోని శక్తి లోనికి చొచ్చుకు పోయి బట్టలలోని ఎంతటి వదలని మురికిని వదలిస్తుంది గనక. దీనిలో మహత్తర చర్యతో కాంతివంతం చేసే ప్రత్యేకమైన పదార్థం ఉంది మరి.

**తాజాగా, హాయినిచ్చే పరిమళం**

మీ యింట్లోని బట్టలన్నింటినీ ఉతికేందుకు హాయిగా, పరిమళం చిందించే 'కీ' వాడండి. 'కీ' వేణ్ణీళ్ళలో, చన్నీళ్ళలో కూడా యిట్టే కరుగుతుంది—సమృద్ధిగా నురుగునిస్తుంది—ఉప్పు నీళ్ళలో కూడా.

**మీ బట్టలకు సురక్షితమైనది— మీ చేతులపై సున్నితమైనది**

సమృద్ధియైన 'కీ' నురుగు మీ ఉతికే పని మరింత [illegible] సులభంగా [illegible] బట్టలను [illegible] శుభ్రంగా, [illegible], మరింత తెల్లగా కాంతివంతంగా చేస్తుంది.

*90 గ్రా., 200 గ్రా. కార్టన్లలో, 500 గ్రా., 1 కి.గ్రా. పాలిప్యాక్‌లలో దొరుకుతుంది.*

అయినా పేరెన్నికగన్న ఇతర డిటర్జెంట్ల కన్నా 30% తక్కువ ఖర్చుతో

గోద్రెజ్ ఉత్పాదన

CHAITRA-G 78 TEL.

## రచయితలకు మనవి

కార్టూన్‌లతోను కథలతోను స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరులు జతపరచకపోతే వాటిని తిప్పిపంపటం సాధ్యంకాదు. సం.




ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]

శుక్రవారం : 17-3-'78
పింగళనామ సం. ఫాల్గుణ శు. అష్టమి
సంపుటము 71 : సంచిక 26

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


విషయసూచిక



అట్టమీద బొమ్మ :
స్వాతి మాధవి
(ఫోటో : పి. ఎం. వరప్రసాద్)

ఆకారం పోకడ – బొమ్మన్
















## అట్టమీద బొమ్మ

• అందాల తార హిందీ తారల్లో సొంపు సొంపుల తార కొమిల్లా విర్క్ ముఖచిత్రం ఈ వారం పత్రికకు శోభను చేకూర్చింది. తెలుగుతారల ముఖచిత్రాలేగాక హిందీ తారల చిత్రాలు కూడ ప్రచురిస్తున్నందులకు అభివందనలు ఇంకా సజ్జిన్, కేటీ మీర్జా, షి ఆర్ మొదలైన తారల ముఖ చిత్రాలు ప్రచురించ వలసినదిగా కోరుచున్నాను.

పందల రోశయ్య (బండ్లవారిపాలెం)

* * *

24—2—78 ఆంధ్రపత్రిక ముఖచిత్రం సుందరి, హిందీ చిత్ర సీమ సరికొత్త నటి మీనాక్షి ఆనంద్‌తో వెలువడిన వార పత్రిక చాలా బాగుంది. శ్రీనివాస్‌గారి సినిమా కబుర్లు నాట్ ఇంటరెస్టింగ్.

మేడపాటి గురురెడ్డి, (పెనుగొండ)

* * *

3—3—78 వ తేది పత్రిక, కొమిల్లా విర్క్ ముఖచిత్రంతో చాలా నీట్‌గా, మా చేతి కందింది. మీ (వార) పత్రిక.

సినిమా కథ సింప్లీ సూపర్బ్, కార్టూన్లు చాలా తక్కువ వేశారు. ఇక, జి. వి. జి. గారి పేజీలో అడవిరాముడు మూడు కేంద్రాలలో ఆడుతున్నట్లు ఇవ్వబడింది. కాని నాంగా నగరం కరణాలు ఆయన మర్రిపాంగారావా ద్విశతదినోత్సవం ఎవిమిది సూత్రమే. రజతోత్సవ కేంద్రాలను, ఆయన ద్విశత దినోత్సవ కేంద్రాలుగా వ్రాసారు. ఎల్లప్పుడు పత్రిక ముచ్చటగా వస్తుందని ఆశిస్తూ...

పెన్మెత్స హరిబాబు. (విజయవాడ)

(50 వ పేజీ చూడండి)



# కొత్త జీవితం

వేదగిరి రాంబాబు
మైనంపాటి భాస్కర్

సాయంత్రం ఇంటి కొచ్చేసరికి రెడీగా వుంది మృణాళిని.

కాఫీ కార్యక్రమాన్ని ముగించుకుని ఇద్దరం బయల్దేరాం.

ఆఫీసుల్నుంచి ఇంటికి తిరిగొచ్చే వాళ్ళతోను, షాపింగ్ బయల్దేరిన వాళ్ళతోను, రిక్షాల్తోను, సైకిళ్ళతోను, ఆటోల్తోనూ — రోడ్డంతా చాలా రద్దీగా వుంది.

ఆ రద్దీలో కూడా పక్కన మృణాళినితో నడుస్తుంటే ఏదో ఆనందం, అనుభూతి!

చనిపోయిన విశ్వం, శారద గుర్తు కొచ్చారు.

ఇప్పుడామె మరొకరితో ఇలాగే తిరుగుతూంటుంది. పాపం విశ్వం!

"ఏంటండీ ఆలోచిస్తున్నారు?" మృణాళిని పలకరింపుతో వులిక్కిపడ్డాను.

"అబ్బే.. ఏంలేదు. విశ్వం గుర్తొచ్చాడు. అతను బ్రతికున్నంతకాలం అతనే తప్ప ఆమెకి వేరే ప్రపంచం లేనట్లు ప్రవర్తించిందామె. అతను పోయి సంవత్సరం కూడా కాకుండా మరొకరికి జీవిత భాగస్వామినై కూర్చుంది. బహుశా స్వర్గాన్నుంచి అతనే గ్రహిస్తుంటాడు! నిజంగా మనుష్యులెంత స్వార్థపరులు..."

*(గత సంచిక తరువాయి)*

"సర్దాగా ఏదైనా మాట్లాడక ఆ విషయం ఎందుకండీ... ప్లీజ్! టాపిక్ మార్చండి."

విన్నో జంటలు కనిపిస్తున్నాయి రోడ్డు మీద.

ఒకళ్ళ మనసులో రెండోవాళ్ళ మీద ఎంత ప్రేముంది? అదెంతకాలముంటుంది?

...ఈ ఆలోచన్లు మనసుని చికాకు పరుస్తున్నాయ్.

అటుగా వెళ్తున్న ఆటో ఎక్కి, కోఠీ జేరుకున్నాం.

లేత నీలం రంగంటే నాకేకాదు, తనకీ ఎంతో ఇష్టం! నా వంటిమీద ఆ రంగు బాగా నప్పుతుందంటుంది. అందుకే అదే రంగు బట్టలు తీసుకుంది నాకు. తనకి మాత్రం ఏ చీరా వద్దంది. బలవంతాన నీలంరంగు నైలెక్స్ చీర తీసుకున్నాను.

నీలంరంగు యూనిఫారంతో ఇంచక్కా చట్టా పట్టాలేసుకుని అలా బయల్దేరి సిన్మాచూసేయాలితామిద్దరూ— ఎల్లుండి!

ఆ విషయమే ఆమెతో అన్నాను.

నవ్వింది.

ఇద్దరం బయటికొచ్చి కామత్‌లో కాఫీ తాగి నెమ్మదిగా ఇంటికి జేరుకున్నాం.

పుట్టింరోజు జరుపుకునే అలవాటు నా కెప్పుడూ లేదు.

కానీ తప్పదు మృణాళిని చిన్నబుచ్చుకో కూడదు. ఆ రోజు ప్రోగ్రామంతా తనే ఫిక్స్ చేసింది. శలవు దొరక్కపోవడంతో అనుకున్న కార్యక్రమంలో చిన్నపాటి మార్పులు చేయాల్సొచ్చాయ్!

సరిగ్గా ఉదయం ఆరుగంటలకల్లా బల వంతాన లేపి కూర్చోబెట్టింది కాలకృత్యాలు తీర్చుకునేలోపు కాఫీ సిద్ధం చేసింది. కాఫీ పుచ్చుకున్నానో లేదో—

"తలంటుకుందురుగాని లేవండి" దూసుకొచ్చింది.

తనే దగ్గరుండి స్నానం చేయించి, తల తుడిచింది. కొత్త బట్టలకి పసుపు రాసి తెచ్చిచ్చింది. ఆమె హడావుడి చూస్తుంటే నవ్వొచ్చింది.

"నేను బట్టలు కట్టుకోవాలంటే వెంటనే నువ్వు కూడా స్నానంచేసి, మొన్న మనం కొన్న చీర కట్టుకోవాలి" అన్నాను.

"ఇవాళ పుట్టింరోజు మీది! నాది కాదు."

"అయినా నువ్వు నా అర్ధ భాగానివి. ఆ అర్ధ నలంకరించబోతే ఎలా?"

"మాటలు బాగా చెప్తా రే!"

"నా మాటలే కాదు చేతలు కూడా బాగానే వుంటాయ్..."

"సర్లెండి మీతో వాదించలేను స్నానం చేసి వస్తాను" లోపలికెళ్ళిపోయింది

కొత్త బట్టలు వేసుకుని తిరిగి సేవ రందుకున్నాను

దాదాపు పది నిముషాలు గడిచాయ్

"సరిపోయింది. మళ్ళీ ఆ పేపరందు కున్నారూ?" తలెత్తి చూశాను.

నీలం చీరలో ఆమె అందం మరింత వికసించింది. తలంటి పోసుకుని తడారడం కోసం వదులుగా వేసుకున్న జడ ఆమె మొహానికో వింత అందాన్ని తెచ్చింది.

ఈ అందం నాది!

రెప్ప వాల్చకుండా ఆమెకేసి అలాగే చూస్తూ కూర్చున్నాను.

# కొత్త జీవితం

"రెండు ప్లేట్లు వద్దు" అన్నా నామె వంకే చూస్తూ.

అర్థం కానట్టు చూసింది.

"సరే అయితే ఒక పని చెయ్యి. ఆ ప్లేటుని పక్కన బెట్టు. ఇద్దరం ఈ ప్లేటులోనే తిందాం. ఇదైపోయిన తర్వాత ఆ ప్లేటు సంగతి చూద్దాం" అన్నా నెదు




"ఏంటి అలా చూస్తున్నారు" చిన్నగా నవ్వింది.

అలా చూస్తుంటే ఆమెని దగ్గిరికి లాక్కోవాలని, ఏమేమో చేయాలనీ అన్పిస్తుంది.

చటుక్కున వంగి పాదాలకు దణ్ణం పెట్టింది.

ఆమె అలా తప్పకుండా చేస్తుందని ముందే ఊహించినా ఆ క్షణంలో చెప్పలేని మధురానుభూతికి లోనయ్యాను. భుజాలు పట్టుకుని పైకి లేపా నాప్యాయంగా.

ఆ కళ్ళల్లో ఆరాధన, ఆత్మీయత!

దగ్గిరికి లాక్కుని హృదయానికి హత్తుకున్నాను!

అలా ఇద్దరం ఎంతసేపున్నామో తెలీదు—

"వదలండి మీకు టిఫిన్ తెచ్చిపెడ్తాను" నా చేతుల్లోంచీ సున్నితంగా వదిలించు కుంటూ మృణాళిని అన్న మాటల్తో తిరిగి ఈ లోకంలో కొచ్చాను.

ఆమె లోపలికి వెళ్ళింది కుర్చీలో కూలబడ్డాను.

మరుక్షణంలో రెండు ప్లేట్ల ఉప్మా, గిలాసు కాఫీలతో వచ్చింది.

రుగా టీపాయ్‌మీద పెట్టున్న ప్లేట్లకేసి చూస్తూ.

చిన్నగా నవ్వింది మృణాళిని.

పెళ్ళైనప్పటికన్నా నా క్కావల్సింది ఆ నవ్వు మొహమే!

"నోరు తెరవండి" స్పూన్‌తో ఒకగులాబ్ జాంని సగంచేసి నా నోటి కందించింది. మిగిలిన సగం నేనామె నోటికి అందించాను.

—ఇద్దరం నవ్వుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ ఆ రెండు ప్లేట్లనీ పూర్తిచేశాం. తర్వాత కాఫీ కార్యక్రమాన్నికూడా సంయుక్తంగానే దిగ్విజయంగా ముగించాం.

"ఇవాళొక్కరోజూ నా మాటకి నువ్వేమీ ఎదురు చెప్పవద్దు" వంటపన్లో కూడా ఆమెకి చేతనైనంత సాయం చేశాను.

వంటైపోయింది.

కబుర్లు చెప్పుకుంటూ భోంచేశాం.

అప్పుడు గుర్తుకొచ్చింది ఆఫీసువిషయం వాచీ చూసుకున్నాను.

పది కావస్తోంది—

"మృణా! ఆఫీసు టైమైంది. మరి నే వస్తా" తృప్తిగా ఆమె వంకే చూస్తూ అన్నాను.

"పిల్లైతే కాస్త ముందే వచ్చేయడానికి ప్రయత్నించండి" వక్కపొడందిస్తూ అంది

సిగిరెట్టు ముట్టించి "నాలుగ్గంటలకల్లా వచ్చేస్తా"నని చెప్పి బయల్దేరాను.

"సాయంత్రం మీకోసం సరిగ్గా వెజిటబుల్ బిర్యానీ రెడీగా వుంచుతాను" నా వెనకే గేటుదాకా వస్తూ అంది

ఆ రోజెందుకో మృణాళిని వదిలి వెళ్ళాలంటే రోజుకన్నా ఎక్కువగా దిగులేస్తోంది కాళ్ళు ముందుకు పట్టం లేదు. తప్పదు వెళ్ళితీరాలి.

మామూలే!

రెండడుగులేసి వెనక్కి తిరిగాను.

ఆమె అక్కడే నించొని చూస్తోంది.

వెనక్కి తిరిగి వెళ్ళిపోవాలనే కోరికని బలవంతాన అణచుకొని తిరిగి బయల్దేరాను.

సందు మలుపు తిరుగుతూ ఇంటికేసి చూశాను.

ఇంకా అక్కడే నిల్చొనుంది పిచ్చిమృణా!

టైమైపోవడంతో అటుగా బోతున్న ఆటోనాపి, ఎక్కాను.

ఆఫీసుకి చేరింతర్వాత కూడా మనసు పనిమీద సరిగ్గా లగ్నం చెయ్యలేకపోయాను. ఆలోచనన్నీ మృణాళిని మీదే!

సుమారు మూడు గంటల ప్రాంతంలో "మీ కోసం కుర్రాడెవరో వచ్చాడు" అంటూ వచ్చి చెప్పాడు ప్యూన్ పాపయ్య.

నా కోసం ఈ సమయంలో ఇప్పుడొచ్చే కుర్రాడెవరు? అర్థంగాక కుర్చీలోంచి లేచి బయటికొచ్చాను.

శ్రీను!

అతను మా పక్కింటి వాళ్ళబ్బాయ్!

ఇతన్తో పెద్ద పరిచయం కూడా లేదు. మరి తన కోసం ఎందుకొచ్చాడు!

నన్ను చూడగానే గబగబా దగ్గర కొచ్చాడు.

అతని మొహంలో ఆందోళన కొట్టొచ్చి నట్టు కనబడుతోంది.

"మీరు...మీరు...అర్జంటుగా వెళ్ళాం" కంగారుతో మాటలు కూడా సరిగ్గా రావడంలేదు.

"ఏం జరిగింది...? ఎందుకు...?" అయోమయంగా అడిగాను. మనసెందుకో కీడుని శంకిస్తోంది.

"మరి...అత్తయ్యగారేదో చేస్తుంటే ఇందాక...పొరబాటున చీరంటుకుంది...."

అతను చెప్పేదేంటో వినబడ్డం లేదు.

గిరుక్కున వెనక్కివెళ్ళి, ఆ విషయం సెక్షన్ హెడ్‌తో చెప్పి వెంటనే బయటి కొచ్చాను

"అమ్మావాళ్ళు అత్తయ్యగార్ని హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. అక్కడికెళ్దాం..." అయోమయంగా అతని వెనకే బయల్దేరాను.

భగవాన్!

ఏమిటీ శిక్ష!

మృణాళినికేమైనా జరిగితే... భరించలేను...

ఆమెను కాపాడే భారం నీదే...

"వళ్ళు బాగా కాలిందా?" ఆత్రంగా అడిగాను.

"బాగానే కాలింది. నేనొచ్చేప్పుడు స్పృహలోలేరు" బాధగా అన్నాడతను.

ఒకవేళ మృణాళిని...

మనసు మొద్దుబారి పోయింది.

అలా కొయ్యబారి పోయాను.

అక్కడ్నించి హాస్పటల్‌కి ఎలా జేరుకున్నామో, మృణాళినున్నంచిన గదికెలా జేరుకున్నామో కూడా సరిగ్గా తెలీదు.

అప్పటికే ఆమె మీద పూర్తిగా గుడ్డ కప్పుండడం చూసేసరికి గుండె కొట్టుకోవడం ఆగిపోయి నట్లనిపించింది.

పక్కింటావిడ కన్నీరు తుడుచుకుంటూ పక్కకు తప్పుకుంది.

"మృణా... మృణా..." పిచ్చి వాడిలా ఏడ్చేస్తూ ఆమె శవం మీద పడిపోయాను.

ఆ తర్వాతేం జరిగిందో నాకు తెలీదు.

తిరిగి కళ్ళు తెరచేసరికి మా ఇంట్లో మంచంమీదున్నాను. వళ్ళు కాలిపోతుంది. తల పగిలిపోతోంది. చుట్టూ అమ్మా, నాన్న అన్నయ్య, వదిన- అందరూ నిలబడి ఆందోళనగా చూస్తున్నారు.

జరిగిందంతా జరిగిందని నమ్మబుద్ధి కావడం లేదు.

అదంతా కలకాకూడదూ—ఉహూఁ! నాలాంటి దురదృష్ట వంతుడికి అలాంటి కలలవవు.

ఇంతవరకూ నన్ను మించిన అదృష్ట వంతుడు లేడనుకున్నాను, కాని ప్రాణానికి ప్రాణమైన భార్యన్ని పోగొట్టుకున్న నాకన్నా దురదృష్టవంతుడుండడు!

ఆరాత్రి టాక్సీలో మావూరెళ్ళి సెలవంతా

మృణాళిని నన్ను ఒంటరిగా వదిలి వెళ్ళిపోయింది.

ఎక్కడికి వెళ్ళినా ఇద్దరంకలిసేవెళ్దామని చివరికి నన్నొంటరిగా వదిలి తనొక్కతేవెళ్ళిపోయింది. తను లేకుండా నే నిక్కడెలా వుంటానని కూడా వూహించలేదు... ఊహూఁ ఊహించే ఉంటుంది... పోయే ముందు శారీరకంగానేగాక మానసికంగా కూడా చిత్రవధ ననుభవించుంటుంది.

ఇంక ఆ యింటికి వెళ్ళలేను... హైదరాబాద్‌లో వుండలేను.

మృణాళిని గుర్తుకుతెచ్చే చోటేదీ నేను భరించలేను... నా గుండె పగిలిపోతుంది, అవి జూస్తే.

రోజులు గడిచిపోతున్నాయ్.

శలవైపోయింది. తిరిగి హైదరాబాద్ వెళ్ళక తప్పలేదు.

నేనంతకు ముందెప్పుడూ చూడని ప్రాంతం, జన సమర్దం ఎక్కువగా లేని ప్రాంతంచూసి ఇల్లు తీసుకున్నాను. అయినా గాని ప్రతిక్షణం మృణాళిన్ని గుర్తు తెచ్చుకోకుండా వుండలేకపోతున్నాను. ఏ జంటని చూసినా మృణాళినే గుర్తుకొస్తోంది. పొద్దున నిద్రలేచింది మొదలు తిరిగి రాత్రి. నిద్రపోయేవరకూ ప్రతిక్షణం మృణాళినే కళ్ళముందు మెదుల్తోంది.

పిచ్చిగానీ తానే నేను, నేనే తానుగా మెలగిన మృణాళిన్ని మర్చిపోవడం ఎలా సాధ్యం? సంవత్సరాలు కాదు యుగాలైనా ఆమెని తను మర్చిపోలేడు. తన గుండెల్లో ఎప్పటికీ చెరగని రూపాన్ని ముద్రించింది.

పగలంతా ఆఫీసులో అందరిమధ్యా ఎలా గోలా గడిపేస్తున్నాను. తీరా సాయంత్ర మయ్యేసరికి దుర్భరమైపోతోంది

ఆఫీసులోంచి బయట పడ్డాను.

నాక్కొద్దిగా ముందుగా శశి, ప్రసాద్ వెళ్తున్నారు.

వెంటనే మృణాళిని గుర్తుకొచ్చింది.

కళ్ళు నీళ్లతో నిండిపోయాయ్!

ఇంటికి వెళ్ళబుద్ధి పుట్టడం లేదు.

తెల్సినవాళ్లెవరి దగ్గరికైనా వెళ్దామంటే మరీ చిరాకు—మృణాళిని ప్రసక్తి తెచ్చి సానుభూతి ప్రకటించాలని చూస్తుంటారు.

సినిమాకెళ్తే కనీసం రెండు గంటలైనా మనసుని మరోదోవ పట్టించవచ్చు-

దగ్గర్లోవున్న సినిమాహాలు కెళ్ళి, ఏ సినిమా ఆడతోందో కూడా తెల్సుకోకుండా— టిక్కెట్టుకొని సరాసరి హాల్లోకి వెళ్ళి కూర్చున్నాను.

లోపలనేక జంటలు...

సర్దాగా కబుర్లు చెప్పుకుంటూ సినిమా చూచి ఆనందించడానికి వచ్చారు. తనేమో బాధని మర్చిపోడానికి సినిమాకొచ్చాడు. అలా వాళ్ళని చూస్తుంటే మర్చిపోవడం మాట టుంచి, మరిన్ని జ్ఞాపకాలు మనసునిముసిరి బాధపెడు తున్నాయ్!

లేచి బయటికొచ్చేద్దామనుకున్నాను.

ఇంతలో లైట్లారి పోయాయ్. సినిమా మొదలైంది.

...ఆ సినిమా కథ కూడా భార్యా భర్తల అన్యోన్య జీవితానికి సంబంధించిదే!

బయటికొచ్చేశాను.

టివికి బదులు బైనాకులర్ కొన్నావేంటోయ్?

పక్కింటి మేడ మీద టివిని బైనాకులర్‌తో చూస్తే బ్రహ్మాండంగా కనిపిస్తోంది.

పూర్తిగా చీకటి పడిపోయింది. నా జీవితం ఎప్పుడో చీకట్లైపోయింది! నెమ్మదిగా ఆలోచిస్తూ బయల్దేరాను.

అబిడ్స్ చేరుకున్నాను.

కాఫీ త్రాగుదామని ఎదురుగావున్న హోటల్ కేసి నడిచాను. అక్కడా జంటలు!

గబుక్కున ఓ గుక్కెడు కాఫీని చేదు విషంలా మింగి బయటికొచ్చేశాను.

హు! ఎంత మార్పు!

ఆఫీసొదలగానే నరాసరి ఇంటికెళ్ళిపోయేవాడు. ఒక్కక్షణం ఆలస్యమైనా తల్లడిల్లిపోయేది మృణాళిని. తనని చూడగానే ఆమె మొహం ఆనందంతో విప్పారేది. ఇద్దరూ సర్దాగా కబుర్లు చెప్పుకుంటూ కాఫీ త్రాగేవారు

ఎంత చక్కటి అనుభూతి!

మరిప్పుడు?

ఇలా రోడ్లు వెడతిరుగుతూ హోటళ్ళు ముద్దరిస్తున్నాడు!

—కిల కిల నవ్వుకుంటూ ఓ జంట పక్కనించి వెళ్ళిపోవడంతో ఈ లోకంలోకి వచ్చాను.

ఇప్పుడెంత ఆనందంగా వున్నారో ముందంత బాధపడాలని వాళ్ళకి తెలీదు. తెలిస్తే ఇలా అనుబంధం పెంచేసుకోరు!

వాళ్ళకేసి పరీక్షగా చూశాను.

ఆమె...ఆమె...అచ్చం మృణాళినిలాగానే వుంది. అదే పర్సనాలిటి!...

పిచ్చెక్కిపోయినాబాగుండు. అప్పుడే తనకీ ఆలోచన్లు ఉండవీ విముక్తి!

ఇప్పుడింటికెళ్ళి ఏంచేయాలి?

మనసు పరి పరి విధాలా పోతోంది.

చివరికో నిశ్చయాని కొచ్చాను.

సరాసరి ఓ బార్‌లోకెళ్ళాను. నాలాంటి వాళ్ళే ఉంటుంటాను అక్కడ చాలా మందున్నారు.

వాళ్ళందరూ నాలాంటివాళ్ళే విందుకవుతారు? కొందరు సర్దాకోసం వచ్చినవాళ్ళు, కొందరు అలవాటుగా వచ్చినవాళ్ళు... ఇలా వుండుంటారు! తనలాంటి నిర్భాగ్యులు ఇక్కడేకాదు ఎక్కడా వుండరు వుండకూడదు కూడాను.

"ఏం తెమ్మంటారు" బేరర్ వచ్చాడు.

"ఏమేం వున్నాయ్?" అతను నా వంక చిత్రంగా చూశాడు 'బహుశా! వీడెవడో కొత్త మొహంలా వున్నాడే!' అనుకొనుంటాడు.

అతను చెప్పిన పేర్లలో నాకు తోచిందేదో చెప్పాను.

తెచ్చాడతను. రెండు సోడాలు, ఐను, గ్లాసు కూడా తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

కొద్దిగా మందుని గ్లాసులోకి వంపుకున్నాను.

అతను సోడా ఓపెన్ చేశాడు.

సోడాని గ్లాసులోకి వంపుకున్నాను.

తాగబోయాను...

హఠాత్తుగా మృణాళిని గుర్తొచ్చింది.

"తాగేవాళ్ళంటే నాకసహ్యం..."

ఒకసారి తాగుడు ననహ్యించుకుంటూ ఆమె అన్న మాటలు ఠక్కున గుర్తొచ్చాయ్,

'మీరు తాగడం కూడా మొదలుపెట్టారా?' దీనంగా ఆమె నావంకే చూస్తున్నట్లనిపించింది.

చటుక్కున గ్లాస్ టేబుల్ మీద పెట్టేసి నిల్చున్నాను.

బేరర్ నాదగ్గరకి పరుగెత్తుకొచ్చాడు.

"బిల్లెంత?" అడిగాను,

"మరి..." బల్లవంకే చూస్తూ నీళ్ళు నమిలాడు.

"పర్లేదు...చెప్పు."

చెప్పాడు.

## కొత్త జీవితం

బిల్లు చెల్లించి బయట పడ్డాను.

మృణాళిని శారీరకంగా నన్ను విడిచిపెట్టిపోయినా మానసికంగా నన్ను వెంటాడుతూనేవుంది. ఆమెకి నచ్చని విషయాన్ని నేను చెయ్యలేను.

సిగరెట్టు మీద సిగరెట్టు కాలుస్తూ పిచ్చివాళ్ళా రోడ్ల వెంట తిరగసాగాను. ఎక్కడెక్కడ తిరుగుతున్నానో కూడా అర్థం కావడం లేదు. కాళ్ళు పీకుతున్నాయ్! అయినా తిరుగుతూనే వున్నాను.

"ఏమండీ!" పిలుపుతో ఠక్కునాగిపోయాను.

గుమ్మంలో నిలబడుందామెవరో! అంతకన్నా మరెవరూ కన్పించలేదు నన్ను కాదేమోననుకొని తిరిగి బయల్దేరాను

"ఏమండీ!" మళ్ళీ అదే పిలుపు

అప్రయత్నంగా అటుకేసి నడిచాను.

వస్తున్న నన్ను చూస్తూనే ఆమె లోపలి కెళ్ళి పోయింది. ఆమె వెనకే నేనూ వెళ్ళాను.

అదో చిన్నగది—

వస్తువులన్నీ చిందర వందరగా వున్నాయ్. ఓ మూల మంచం వాల్చుంది. దానిమీద తెల్లటి దుప్పటి...

## యువతరం

స్నాతకోత్తర విద్యాకేంద్రంఅంటేపి.జి సెంటర్‌లు! అనంతపురంలోగల స్నాకో.వి.కేంద్రంలో ఎమ్.క్వామ్ లో ఈయా ఏడాది చేరినకుమారి సురభి శైలజ హాబీలు సంఘసేవచేయటం— టేప్‌రికార్డింగూనట (సంఘసేవని టేప్‌రికార్డ్ చేస్తుందనుకోవద్దు) అయితే ఆశయం మాత్రం లెక్చరర్‌లేదా ఓ పెద్ద ఆఫీసర్ అవడం— వి.శైలజ సినిమాలు చాలా కొంచెం చూస్తుంది. లైబ్రరీకి వెళ్ళినా నవలలు మాత్రం చదువదు (డబుల్ ఆశ్చర్యార్థకాలుండాలిక్కడ) ఇంత విన్నాక నీకు సినిమా తారని చూడాలనుంటుందా? అని అడక్కూడదు కాని— అయినా వెరిఫికేషన్ కోసం అడిగితే 'అభిలాష'లేదు పొమ్మంది— టేప్‌రికార్డింగ్ హాబీకి సరియైన కనక్షన్ ప్రశ్నాపత్రంలోని 7వ ప్రశ్నకి జవాబుగా దొరికింది. అదేమిటనగా యం.యస్ సుబ్బులక్ష్మి బాలమురళీ కృష్ణ గాన మాధుర్యం గ్రోలుట యిష్టమట— అయితే సరదాకి పేకాటకూడా



లిస్టులో చేర్చాలి వాలీబాల్, బాడ్మింటన్ ఆటలు చూడటం సర్దా. ప్రొహిబిషన్ ఎత్తివేస్తే మంచిది లేనిపోని అల్లర్లు ఎందుకు?" అన్నది-అదే ప్రొహిబిషన్ ఎక్కడుంది ప్పుడు? ఎత్తివేయడానికి అనడిగితే బహుశ మద్రాసులో అని చెబుతుందేమో... రోజూ రాకపోకలకి ఏ వాహనం? అన్న విషయంలో శైలజ మాటల్లోనే యిలా వుంది సమాధానం "నేను 'మోపెడ్'లో వెళతాను ఎప్పుడన్నా కారు, స్కూటర్ డ్రైవ్ చేయగలను కాని ఎక్కువగా నడిచే వెళతాను"— మదనపల్లి కాలేజీలో చదువుకున్న యీ అమ్మాయికి అబ్బాయిల్ని సరదాగా ఆట పట్టించడం యిష్టమేగాని [illegible] వాళ చేత భంగపడదు. "సోషల్ [illegible]" కావటం యిష్టమే— ఏమైనా అందువల్ల కష్టంవస్తే తప్పించుకోడం తెల్సు ఆవి ధైర్యంగా చెప్పింది— అయితే రూపాయి చిల్లర కోసం 'వక్కపొడి' అహాహా... కొదుకాదు చాక్లేట్‌లు కొంటుందితప్ప మిఠాయి మాత్రం కొనుక్కోదు!

ఇందిరమ్మ మీద అభిప్రాయంకూడా చెప్పింది. "పాపం! ఆమె చాలా మంచిది సార్!"-(మరి కానివాళ్ళెవరో...)

ఇక తిండి అలవాట్లా? — చాక్లేట్‌లు తింటే లావెక్కిపోతాననుకుంటే— సాయంకాలం పూట చపాతీలు తింటుంది కనుక-ఆ సమస్యరాదు... ఇక పెళ్ళి వరకట్నాలలాంటి వాటి మీద "పెద్దఆఫీసర్ని అవుదామనుకుంటున్న యీ ఎమ్. కామ్. గర్ల్"ని ఎలా అడుగులాం? అంచేత బారియ బ్యాంకులో సురభి శైలజ రెండేళ్ళ తర్వాత ఉద్యోగం సంపాదించాలని ఆశీర్వదించాలి.

★★★

# కొత్త జీవితం

"కూర్చోండి. అలా నించున్నారే!" తలుపు లోపల గడియవేస్తూ అందామె.

గుండెలు జల్లుమన్నాయ్!

అప్పుడర్థమైంది నేనెక్కడికి వచ్చానో!

అదేంటి! ఇక్కడికెందుకొచ్చాను? ఆమె పిల్చగానే ఇలా వచ్చేశానేంటి?...

"కూర్చోండి" చేతులు పట్టుకులాగింది.

అప్పటికి పూర్తిగా ఈ లోకంలోకి వచ్చాను.

జేబులోంచి ఓ పదిరూపాయల కాగితాన్ని తీసి ఆమె మీదకి విసిరేసి, తలుపు తీసుకుని గబగబా బయటికొచ్చేశాను.

తల దిమ్మెక్కిపోయింది

'ఛీ!ఛీ! ఎంత పతనమై పోతున్నాను! చివరికిలాంటి కొంపలచుట్టూ కూడా తిరుగుతున్నాను!...'

వెంటనే ఆటోలో ఇంటికొచ్చేశాను.

తాళంతీసి లోపలికి అడుగుపెట్టగానే నవ్వుతున్న మృణాళిని ఫొటో కన్పించింది. వెంటనే కళ్ళు నీళ్ళతో నిండాయ్!

'నన్ను క్షమించు మృణా! ఇవాళ నువ్వు క్షమించలేని తప్పు చేశాను. తాగాలనుకున్నాను చివరికి వ్యభిచరించాలనికూడా అనుకున్నాను కానీ ఏవనీ వేసిన్నపూర్వకంగా చెయ్యలేదు. ఏం చేస్తున్నానో కూడా తెలీని పరిస్థితుల్లో అలా చేశాను. నిన్ను మర్చిపోయి, నీ మీద గౌరవంలేకాకాదు నిన్ను మర్చిపోవాలని, మర్చిపోలేక...' బోరున ఏడ్చేశాను. అలా కాసేపేడ్చాంతర్వాతకాని మనసు కొద్దిగానైనా కుదుటపళ్ళేదు. చాలాసేపు లైటుతీసేసి అలా చీకట్లోనే కూర్చున్నాను.

లేచి సిగరెట్టు వెల్గించాను.

ఎన్ని రాత్రులిలా చీకట్లో కూర్చుని ఒంటరిగా మృణాళిన్ని తల్చుకోవడం? నాకు తోడల్లా సిగరెటొక్కట్టే — అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ నాతోనే వుంటోంది! ఖచ్చితంగా నేనీలోకం విడిచి పెట్టేంతవరకూ నాకు తోడుగానే వుంటుంది!

మృణాళినితో వున్నప్పుడు సిగరెట్టు తక్కువ—

ఇప్పుడెక్కువ—అంతే తేడా!

సిగరెట్టయిపోయింది.

దాన్నిపారేసి మరో సిగరెట్ వెల్గించాను.

అలా ఆలోచిస్తూనే కూర్చున్నాను.

ఆలోచిస్తూనే సిగరెట్ నోట్లో పెట్టుకొని గట్టిగా పీల్చాను. పొగరాలేదు. ఊహూఁ! సిగరెట్టెప్పుడో ఆయిపోయినట్లుంది. ఫిల్టర్ వరకూ కాలి ఆరిపోయింది. విసిరి పారేశాను. ఆదే జేబులో ఆఖరి సిగిరెట్టు: అర్జంటుగా మరో సిగిరెట్టు కావాలిప్పుడు.

ఈ అర్ధరాత్రి సిగిరెట్టు కావాలంటే రెండు ఫర్లాంగులు నడవాలి.

తప్పదు—

లేచి బయల్దేరాను.

రోడ్డంతా నిర్మానుష్యంగా వుంది. ఒంటరిగా నడుస్తున్నాను మరో సిగిరెట్టు సాహచర్యంకోసం.

హఠాత్తుగా ఆలోచన వచ్చింది నాకు—

అంతవరకూ పొగ పీల్చిన సిగిరెట్టు పోగానే విసిరి పారేశాను. మరో సిగిరెట్టు కోసం వెదుకుతున్నాను. మరిప్పుడు పాత సిగిరెట్టు గుర్తుకు రాదేం? దాన్ని గురించి బాధ కల్గదేం?

జీవితానికి అర్థం కూడా ఇదేనా? జరిగిపోయిందాన్ని మర్చిపోయి 'కొత్తవి' వెదుక్కుంటూ వెళ్ళడమేనా?

శారద గుర్తొచ్చింది. ఆతను చనిపోయింతర్వాత ఆమె తిరిగి వివాహం చేసుకోబోతోందని తెల్సిన ఆ రోజు ఆమె గురించి ఎంత చెడుగా అనుకున్నాడు తను. అసలు స్త్రీనే నమ్మకూడదనుకున్నాడు. అంతకుముందు ఆమె భర్త మీద చూపించిందంతా నటననుకున్నాడు. కానీ ఇప్పుడు తెలుస్తోంది. పాత జీవితాన్ని మర్చిపోవడానికి 'కొత్తజీవితా'న్ని ఎన్నుకొందామె!

కానీ తనేం చేశాడు?

మృణాళిన్ని మర్చిపోవడానికి తాగబోయాడు. వ్యభిచార గృహాల్లోకి కూడా వెళ్ళాడు! ఇదికాదు నూతన జీవితానికర్థం. చిన్నతనంలోనే జీవిత భాగస్వామిని పోగొట్టుకున్న తన లాంటి దురదృష్టవంతులకి సరైన సాహచర్యం కావాలి.

ఆ సాహచర్యంలోనే దుఃఖ పూరితమైన గతాన్ని మర్చిపోవాలి. మరో జీవితాన్ని నిర్మించుకోవాలి.

(అయిపోయింది)

స్నేహానికి నిర్వచనమైన
స్నేహితులు శ్రీ 'ఆదివిష్ణు'కి
కృతజ్ఞతలతో- రచయితలు.

చలి చిక్కనౌతోంది. మసక మసక వెలుతురు చీకటి కెరటాలతో పోట్లాడుతూ ఉంటే దూరంగా కొండ నీడలా కనబడుతోంది.



'చీమల బారులా ఎడ్లబండ్లు, పొడుగ్గా ఓపికగా, తీరికగా నడుస్తున్నాయి. బళ్లలో కునుకు తీస్తున్నవారికి గిత్తల మెడల్లోని గంటల శబ్దం ఎక్కడనుంచో వినవస్తున్నట్టు అనిపిస్తోంది.

"చూడక్కా! ఎంత బద్ధకంగా తెల్లవారుతోందో!"

"...ఏమన్నావ్." జానకికి తెలివి వచ్చి అడిగింది.

"పూర్తిగా చీకటిపడే ముందున్న మసకకీ, తెల్లవారే ముందున్న మసకకీ తేడా ఏమిటంటావ్?" కమల అడిగింది.

"నిద్రకు ముందూ వెనకా ఉండే మత్తులో ఉండే తేడా!" కాలేజీలో పట్టం పుచ్చుకుని బావను చేసుకున్న జానకి మరోసారి ఆవులించింది.

కమల తలలో ఆలోచన నెగడై మండుతోంది. క్రవిరిచి పొయ్యిలో పెట్టినట్టు ఫెళ ఫెళ లాడుతుంది రావాయమ్మ. "ఏనుగులా పెరిగిపోయావ్! నీకు మొగుణ్ణి చూడాలంటే వేలు- బంగారాలు-మూటలు పట్టుకోవాలి. అతగాడేమో సంసారం పట్టించుకోడాయె. నా పిల్లల గతేంగాను. నీ యమ్మ చచ్చింది. నేనూ చచ్చుంటే తగువు తెల్లారిపోను."

—కళ్లలో నీళ్లు తిరగడం అలవాటయిపోయిన కమలకి గుండెలో లోతుగా ముల్లు కలుక్కుమంది.

'చీమ మరపకాయ' అన్నపేరు సార్థకం కమలకి అంటారు పై వాళ్లు. బందరు మిరపకాయలా పన్నగా పొడుగ్గా, మిల మిల లాడుతున్న చెక్కిళ్లతో కుర్రకారులందరికీ చూడముచ్చగా, ముట్టుకుంటే చుర్రుమనేటట్టుంటుంది కమల.

టెన్త్ పరీక్షకోసం తిరిగి తిరిగి గుండె గట్టి చేసుకున్న కమలంటే జానకికి అభిమానం. అసలు శివరాత్రికి గుంపయాత్ర కమల ఆలోచనే.

"మేష్టారికి చెప్పక్కా... మవ్ చెబితే కాదనరు."

—మరో అరగంటలో జానకి స్నేహితురాళ్లందరికీ తెలిసిపోయింది. వాగా చీకట్నే బయలుదేరింది బండి.

"అసలు దేవుడిమీద మనుషులకినమ్మకం సన్నగిల్లడానికి కారణం మనుషులా దేవుడా?"— కొత్తగా టీచరుగా చేరిన భానోజీ అడిగాడు రామాన్ని.

చీకటిలోంచి బయల్పడడానికి పోరాడుతున్న వెలుగు వంక చూస్తూ రామం చటుక్కున చెప్పాడు. "మనుషులు, తల్లిదండ్రులు, గురువు, సంఘం."

"అయితే మాష్టారూ, కుర్రకుంకను అడుగుతున్నానని మరోలా..." చుట్టూ ఉన్న చీకటిని ఆసరా చేసుకుని ధైర్యం చిక్కబట్టుకుని మనసులోని సందేహాన్ని అడగడానికి ఉపోద్ఘాతం ప్రారంభించాడు భానోజీ, "మాష్టారూ, మీకు దేవుడంటే నమ్మకం వుందా?"

"అది భగవంతుడికి తెలియాలి."

"మీకు నమ్మకమే ఉంటే. ఏడుకొండలవాణ్ణి...

ఆపద మొక్కులవాడని కోట్లు ఆర్జిస్తున్నాడు మోతుబరి దేవుడు. 'సామాన్యుడికి అందకుండా ధర పెంచుకుంటూ నానాటికీ కొండలెక్కి పోతున్నాడు. మనకీ మనలాంటి వాళ్లకీ అందుబాటులో ఉండేది మన గుంపేశ్వరుడు— అతను పిలిస్తే మనం పలకాలి. మనం పిలవకుండానే అతను పలుకుతాడు."

"మీరు రివల్యూషనరీలండీ" విస్తుపోయాడు భానోజీ.

"ఆ పదం వాడడం మనం ఎంత మానేస్తే అంత మంచిది. గుడ్డలు విప్పేయడం కాదోయ్ విప్లవాత్మకత. వస్తువుల్నీ విషయాల్నీ, మనసు కోణంలో, రక్తంలో చూసి, అవగాహన చేసుకోగలగడం"

"మరి నా లాంటి వాళ్లకు దేవుడిమీద నమ్మకం కుదరాలంటే?"

"మనసుతో ఆలోచించు. మస్తిష్కంతో కాదు."

రామం అంటే అందరికీ గౌరవమే — ఒక్క రంగారావ్‌కి తప్ప. రామం ఎందుకూ పనికిరాని వాడనీ, అతని భార్య జానకి గొడ్రాలనీ, రామానికీ ప్రైవేటు పిల్ల కమలకూ ఏదో సంబంధం ఉందనీ డోలు వాయిస్తూ కమల ఇంటి ముందు రోజుకి అరడజను సార్లు షికార్లు కొట్టడం రంగారావుకి అలవాటు.

అసలు రంగారావ్ స్వభావమే విచిత్రమైనది. ఆడపిల్ల— వయసు లేతదైనా, ముదరదైనా తేడాలేదు. పండు రుచి

వండుదీ, పింజ రుచి పింజదీ అంటాడు. పాలికేళ్ళ క్రిందట మ్యాలు పై వలు చదువు తున్నప్పటి మంచీ అతని వరస ఇదేనని తెలిసినవాళ్ళు చెబుతుంటారు. చిన్న ఊర్లలో అందరిగురించీ అందరికీ తెలియడం అబ్బురమూ కాదు. అనుచితమూ కాదు. కాని ఏది చేసినా, ఎవరికీ పట్టిగ్గా ఆమాకీ దొరకని పద్ధతిలో చేస్తాడు రంగారావ్. తియ్యగా మాటాడుతాడు నీటుగా ఉంటాడు. విలాసంగా ఖర్చు పెడతాడు. 'ఓక్లాసు వాడు వాడికేం' అంటారు 'ప్రజలు'

రంగారావును అసహ్యించుకోవడం, అసహ్యించుకునే పారిలో అవగాహనా రూపమే అంటాడు రామం.

-బళ్ల చక్రాలు ఇరుసులకు రామ్తా ఉంటే 'గుయ్' మని శబ్దం 'అబ్బ! అబ్బ! ఉన్నట్టుండి ఎంత వెలుగు వచ్చిందో' రామం సంతోషంగా అన్నాడు.

"నాయుడూ, నాయుడూ, బండి ఆపవా, నే దిగి నడుస్తా" కమల నాయుడిని కుదిపివేసింది.

"ఓ.. హో, ఓహో"— నాయుడు బండిని ఆపాడు. దిగ్గున గెంతి చెంగు చెంగున పరుగెత్తి బళ్ళ ముందుకు సాగింది కమల.

"ఏం పిల్లమ్మా! ఏం కాలమో!" మీనాక్షమ్మ నీవగించుకుంది.

"అదేమిటొదినా, పిల్ల సరదాపడింది. మనమంతా పరుగులెట్టిన వాళ్ళం కాదూ? నడిస్తే తప్పా?" జానకమ్మ,

"లేదమ్మా, ఎగిరితే తప్పు." పూర్వ సువాసిని తల మీద బట్ట సర్దుకుంది.

"రాత్రి ఎలామా భోజనం చెయ్యం.." హేమలత.

"బావుందమ్మా, రాత్రి భోజనంగురించి ఆలోచిస్తున్నావ్... అసలు బండి దిగగానే వడ్డించమనేటట్టున్నావ్" జానకమ్మ హాస్య మాడింది.

"పోన్లెవో, అందరూ ఒకలా ఉంటారా? కొందరు ఉపవాసం చెయ్యలేరు. అలాగే తల్లీ, బండి దిగగానే ఉప్మా, కాఫీ చేసేస్తాగా. ఎవరి శక్తికి తగ్గట్టు వారు చెయ్యాలి."

"అనవండీ, భక్తి, మంచితనం లాగే మనసులో ఉండాలి కాని— ఉపోష్షాల వల్ల

## మద్య నిషేధం మీద తమిళుల మోజు

మద్రాసు క్రిష్టియన్ కాలేజి గణాంకశాఖ విద్యార్థులు 90మంది జనవరిలో తమిళనాడు రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు చెందిన 1,800 మందివ్యక్తులతోజరిపినఇంటర్వ్యూలో ఈక్రింది విషయాలువెల్లడయినాయని ది మెయిల్ పత్రిక ప్రకటించింది.

80% కంటే ఎక్కువ మంది వ్యక్తులు మద్యనిషేధాన్ని కొనసాగించాలని కోరుతున్నారు. 54 వ్యక్తులు హిందీని పాఠశాలల్లో విధిగా ప్రవేశపెట్టడానికి వ్యతిరేకంగా వున్నారు కాని 68% వ్యక్తులు హిందీని నేర్చుకొనుట మంచిదే అంటున్నారు. ఐదుగురిలో ఇద్దరు యమర్జెన్సీని ప్రకటించడం వలన దేశానికి మంచే జరిగిందని నమ్ముతున్నారు.

## ఏలుకో...ఏలుకో

వస్తుందా?"

అక్కడికి తిండిగోల ఆపుచేసింది జానకి ఈ మాటలని.

బాగా తెల్లారిపోయి క్షేత్రం దగ్గరపడిందేమో మగాళ్ళందరూ బళ్ళుదిగి నడుస్తున్నారు.

"గుంపేశ్వరుడు నీకు మంచి మొగుణ్ణి ఇస్తాడులేవే బొట్టీ"— ముందు బండిలో కూచున్న ముసలాయన అన్నాడు.

"బావుంది తాతా! నేను నంబరానికి రాకపోతే ఇస్తాడా?"

"బొట్టీ శానా గడుస్తి. ఇటురాయమ్మా నచ్చిందేవినాగున్నావ్. ఆ అదుష్టమంతు డెవడో!"

"అందుకే నేనూ వెదుకుతున్నా అవ్వా" కమల ముందుకు వెళ్ళిపోయింది కుచ్చిళ్ళు సర్దుకుంటూ.

గిత్తలు విప్పి చెట్లకు కట్టారు.

పూర్వసువాసిని ముందు ఏటికి వెళ్ళి మునిగివస్తానని బిందె పట్టుకు బయలు దేరింది.

"కమలా, నీ అమ్మ నిన్ను రానిచ్చింది అదీ దేవుడి దయే!" పక్కావిడ

"అక్కతోనూ, మీతోనూ రావడానికి అమ్మకేం అభ్యంతరం? నాన్న నమి లెయ్యడూ?"

కృష్ణస్వామి అంటే రామాయమ్మకి బోలెడు భయమన్నట్టు చెప్పింది కమల. కాని ఊర్లో వాళకి కృష్ణస్వామి సంగతి తెలియనిది కాదు.

మొదటి భార్య చనిపోయిన తరవాత మూడు నెలలు తిరగకుండా కమలని చూడడం కోసమే నన్నట్టు రెండో సంబంధం చేసుకున్నాడు. ఏడేటా పిల్లలు. చంటి, వెంటీ ఆరుగురయ్యారు. కమలకు న్యాయం చెయ్యాలని చేసుకున్న పెళ్ళి అన్యాయంగా పరిణమించిందని వ్యకునే ధైర్యంలేక కృష్ణస్వామి జను పని చేసే మిల్లులో ఓ చక్రంలా అయిపోయాడు ఏడింటికి వెళితే రాత్రి పదింటికి తిరిగి రావడం జీతం రామాయమ్మకివ్వడం- ఆవిడ ఏంత చేస్తే అంత.

పలుగురితోపాటు కమలకి పఠించ చెప్పాడు రామం. కాని మూడు బ్యాగులు దాటినా కమల పాసవలేదు. ఇక చదివించనంది రామాయమ్మ. జానకికి కమలంటే జాలి. తాను చెయ్యగలిగింది లేదని విచారం

రామం, భానోజీ వంటకి కావలసిన సౌకర్యాలు ఆడవాళ్ళకి ఏమకూర్చి అలా తిరగడానికని బయలుదేరారు. వాళ్ళ వెనకాలే బయలుదేరిన కమల భోజనాల వేళకి కూడా తిరిగి రాలేదు.

హేమలతా, కామాక్షమ్మా, వెంకటలక్ష్మీ అంతా కంగారుపడ్డారు జానకి మొహం జేవురించింది.

రామం తన ఆతృతను బయటకు కనపడనియ్యకుండా "ముందు భోజనాలు కాని వ్వండి" అని చెప్పి రెండు మెతుకులు అదరా బాదరా తిని భానోజీని వో వంక పంపి, తనూ మరోసైకిలు పుచ్చుకుని మరోవంక బయలుదేరాడు. తెలిసిన వాళ్ళం దరినీ వాకబు చేస్తూ గ్రామం చేరాడు భానోజీ.

తెలిసిన మరో టీచరు భానోజీని గేలి చేశాడు. "ఏంవోయ్. పచ్చిమిరపకాయకి దూరంగా ఉండడం మంచిది. కళ్ళలో రంయ్ మని నీళ్ళు తిరుగుతాయి జాగ్రత్త!"

–రామం తిరిగి తిరిగి రామాయమ్మ గారింటికి వచ్చాడు అతను తెచ్చిన వార్త విని ఆశ్చర్యపోలేదు రామాయమ్మ.

సాయంకాలానికి మళ్ళీ తీర్థానికి చేరిన రామం, భానోజీ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"మన బాధ్యత తీరిపోయింది మాష్టారూ! ఆ అమ్మాయి తల్లి తండ్రులకి చెప్పాం. ఇక మనం చెయ్యగలిగినదేముంది? ఇంతకీ అమ్మాయి బొత్తిగా నోరు లేనిది కాదుగా! మీరు అవసరమనుకుంటే పోలీసు రిపోర్టు..."

"గుంట రంకుముండ! అదేం తక్కువదా! పోలీసు రిపోర్టిచ్చి వాళ్ళ వెనకాల నువ్వేం తిరుగుతావ్లే నాయనా!" హేమలత అందుకుంది.

–జానకి బిత్తరపోయింది. కమల కోసం తీర్థం సందడి ఆగిపోలేదు రాత్రి ఏడింటినించీ సంబరాలు ప్రారంభమయ్యాయి.

నారాయణదాసు రాసిన రుక్మిణీకల్యాణం హరికథ. మరోపక్క విజయనగరం ఫేమ్ కుమ్మరి మేష్టరు బుర్రకథ– మరోదగ్గర మూడు గుర్రాల బీడీ ఎడ్వర్టైజ్మెంట్ రాజమండ్రి ట్రూప్ రికార్డు డాన్స్. టూరింగ్ హాల్లో మల్లీశ్వరి బొమ్మ.

వింత వింత ప్రదర్శనలూ, మేళతాళాలూ, మైకులో పాటలు.

ఎల్లనుంది కోటయ్య ఏలుకో, ఏలుకో
చెయ్యి కాస్త అందించి చేదుకో చేదుకో
హరోం హరా! హరోం హరా!

కోలాహలంతో చెవులు రింగ్మంటున్నాయి

"మాష్టారూ, మాష్టారూ మన స్కూలు అబ్బాయి చూశానని చెప్పాడు. మీరేం కంగారు పడకండి. ఆ అమ్మాయి రంగారావ్ సైకిల్ వెనకాల కూచుందట. పోనీ ఈ రోజు కాకపోతే పదిరోజులనాడైనా తిరిగి వచేస్తుంది."

భానోజీ హరికథ వెనకాలకొచ్చి రామంతో చెప్పాడు.

"అంతే నంటావా?"

"ఉండండి. మీవాళ్ళకు కూడా చెప్పి వస్తా!" ముందుకు వెళ్ళాడు భానోజీ.

"చూడు పిల్లా, నే చెబితే విన్నావా! అబ్బాయించినాడా, అమ్మాయించినాడా అన్నీ దానిక కండకావరం, ఇలాంటి లండవెత్తు ఏదో వేసే బయలుదేరదీసింది మనందరినీ"

రుక్మిణీ కళ్యాణం వినడంలేదు హేమలతగారు.

జానకికి మరి అక్కడ ఉండబుద్ధి కాలేదు.

"ఇంటికి పోదామండీ" రామం కళ్ళలోకి చూస్తూ అంది.

"అది తెలివి తక్కువతనం. మనం వచ్చింది ఆ అమ్మాయికోసం కాదు. జాగరం చేసి, దేవుడి దర్శనంచేసి మరీ వెళదాం నిజం విలకడమీద తెలియకపోదు... ఏమండోయ్– మీరు మాత్రం ఆ అమ్మాయిని ఆడిపోసుకోకండి" హేమలతగారితో ఏనాడు మాటాడని రామం ఘాటుగా చెప్పాడు.

ప్రత్యేకమైన ప్రయత్నంకాని, హరికథా, బుర్రకథా, ఇత్యాది కాలక్షేపాల అవసరం లేకుండానే జాగరం అయిపోయింది రామారావ్కీ, జానకమ్మకీ. తెల్లవారి స్నానాలూ దర్శనాలు ముగించుకుని ఇళ్ళు చేరారు.

ఊళ్ళోకి తిరిగి వచ్చాక దుమారం వస్తుందని ఊహించిన జానకికి ఏ రకమైన గొడవా చెవిన పడలేదు

ఇరుగమ్మా, పొరుగమ్మా, తీరికగా రామాయమ్మనీ, కృష్ణస్వామినీ, కమలనీ అక్కడి కక్కడే దుయ్యపట్టడం జరిగిపోయిందేమో, రెండు రోజులలో కమల 'లేచిపోవడం' చరిత్రలో భాగమైపోయింది. కాని విషయమేమైనా తెలుస్తుందేమోనన్న ఆశతో కమల ఇంటికి వెళ్ళకుండా వుండలేకపోయింది జానకి. 'దాని దోవన అదిపోతే, అపునమ్మా, నీ కెందుకుటా అంత బెంగ? అదేం తెలివితక్కువది కాదు. మూడుముళ్ళూ పడిఉంటే ముగ్గురి బిడ్డల తల్లి అయేది? నీలాగేం కాదు." జానకి మనసు కలుక్కుమంది. 'పోనీ నన్నేకదా ఆడిపోసుకుంటారు... సవతి తల్లి ఎంత ప్రేమగా చూసినా తల్లి కాదుగా!" చిరుగు చీది చీర కొంగుతో ముక్కూ, కళ్ళూ తుడుచుకుంది రామాయమ్మ.

'ఇంటిలో గొడవేమైనా జరిగిందా?' అని అడగాలనుకున్న జానకికి మరి ధైర్యం చిక్కలేదు.

మరో రెండు రోజుల తర్వాత రామం మాష్టారికి ఓ ఉత్తరం వచ్చింది. కవరు మీద ఎవరో చిన్నపిల్లలు రాసినట్టుంది ఎక్సరసైజు పుస్తకము నుంచి కాయితాలు. లోపల దస్తూరీ కమలది.

వంగాం
శివరాత్రి.

రామం మాష్టారికి

నమస్కారాలతో కమల.

నిజమే – అసహాయత్వమే. నా గోడు ఎవరితో చెప్పుకోను? ఏ ప్రయోజనం ఆశించి?

ఒకరికొకరు సహాయపడిన పరిస్థితులు బ్రతుకులో కొన్నే నాకు దేవుడు కూడా సాయంచేసే స్థితిలో ఉండడు

మిమ్మల్ని మోసం చేయాలనే వేశాను. కాని ఇలా జరుగుతుందనుకోలేదు. మళ్ళీ జన్మలో మీ కాళ్ళమీద పడతాను: నాకు మనిషి జన్మే వస్తే!

జాకెటు ముక్క కొనలేదు నాన్న! చదువు



## ఏలుకో...ఏలుకో

వంటబట్టదు నాకు ...రీవేధవలకు ఊసుపోక నేను. అరుగుమీద కూచుని వాళ్ళని చూస్తూ కాలక్షేపం చెయ్యడం నాకు ఊసుపోక.

ఒక్కడూ వెళుతున్నప్పుడు వెర్రివెంగళాయి మహా మర్యాదగా తలవంచుకుని దొంగ చూపులు చూస్తూనే నడుస్తాడు; నలుగురితో కలిసివస్తున్నాడో మరి వాడి హోయలుకు అడ్డూ అపూ ఉండవు. అప్పుడు వాళ్ళకి నేను లోకువ. వాడు ఒంటరిగా వస్తుంటే, నన్నుచూసి మెలికలు తిరిగి పోతుంటె బుర్ర భూమిలోకి దించేసి వోరకంటితో దొంగ చూపులు చూస్తుంటే నాకు లోకువ. ఆ ఎర్రగళ్ళ చొక్కా, బూచి బుర్రవాడిని చూస్తే నాకు మహా...ఒరేయ్ పిచ్చబ్బీ– ఎందుకురా అంత మొగమాటం! నలుగురితో కలిస్తే తప్ప నా వంక చూడ వన్నమాట...

ఉన్న మాట అనేస్తే! అది ఆడపిల్ల లక్షణం కాదంటుంది మా రామాయమ్మ.

—నాన్నకి అమ్మంటే బలిపాటం ఆగదు అమ్మకి వద్దనే వోపికకూడా ఉండదేమో! అరిచి, అరిచి, చాకిరీ చేసిచేసి శవంలా పడుకుంటుంది. శవంమీద కోరిక తీర్చుకునే వాళ్ళూ ఉంటారని ఎక్కడో చదివాను. రోజూ చూస్తున్నాను, నాన్నకదే ఎంటర్‌టెయిన్‌మెంట్. బీదవాళ్ళకి కూడా 'పెద్ద ఇళ్ళంటే ఇల్లాంటి దృశ్యాలు కళ్ళారా చూడక్కర్లేదు చిన్నవాళ్ళు.

నాకు కంటికి కునుకురాదు. కష్టపడితేగా అంటుంది రామాయమ్మ. తెల్లవారిన దగ్గరనుంచీ వీధి గుమ్మం పిలుస్తూనే ఉంటుంది. తరవాణీ అన్నం తిన్న దగ్గరనుంచి నాన్న తిన్న కంచం రాత్రి కడిగేవరకూ అయిదు నిముషాలకొకసారైనా వీధిలోకి రావాలి.

వంశం, గౌరవం, వల్లకాడూ ఇవన్నీ వదిలేసి నాలాంటి కమలలు విస్తరంటలు కుట్టో. కాగితాల పంచులు అంటించో పొట్టపోసుకునే మార్గం వెదుక్కోవడం అవసరం. ఆడపిల్లలను పోషించడానికి అబ్బాయిని వెదకడం కాదు– వో జీవనాధారం, అవకాశం చూపించడం పెద్దల కర్తవ్యం.

(44వ పేజీ చూడండి)

## మాయాజాలం మతికట్టు

# 'క్రేజీ సిల్కు'

కాకినాడలో నా కాలేజీ చదువు పూర్తికాగానే ఉద్యోగరీత్యా హైదరాబాదు వచ్చి యిప్పటికి ఆరేళ్లయింది. రాష్ట్రంలో ముఖ్యంగా హైదరాబాదు వాతావరణం ఆరోగ్యానికి మంచిదంటారు చాలామంది. దానికి తోడుగా హైదరాబాద్ ఎంతో సుందరమైన నగరం కూడా. హైదరాబాద్, దేశంలోని మిగిలిన పెద్ద నగరాలతో పోల్చిచూస్తే ఏ విషయంలోనూ తీసిపోదు. ఒక్క ట్రాఫిక్ రూల్సు లేకపోవడం తప్ప.

యాత్రీకులు హైదరాబాద్ వస్తే ముఖ్యంగా చూడవలసిన వింతల్లో, యూనివర్సిటీకి వెళ్లే దారిలో స్థాపించబడిన 'శివం' ఈ ప్రదేశాన్ని 'బృందావనం' అంటారు. నిపుణులైన ఇంజనీర్ల పర్యవేక్షణలో సత్యసాయి భక్తులే కూలీలుగా పనిచేసి, భారీఎత్తున నిర్మించిన శివలింగాకారంతో వుండే కట్టడం నిజంగాచూడతగినదే.

ఇకపోతే నగరానికి మధ్యలో కొండమీద పూర్తి పాలరాయితో కిర్లానే నిర్మించబడిన శ్రీ వేంకటేశ్వరాలయం. ఆలయ ప్రాంగణంలో నిలబడి చూస్తే చుట్టూవున్న నగరం ఎంతో సుందరంగా కనిపిస్తుంది.

ఇంక చార్మినార్, వైట్ హౌస్, జుమ్మామసీదు, గోలుకొండ ఫోర్టు, సాలార్జంగ్ మ్యూజియమ్, నెహ్రూ జూలాజికల్ పార్కు మొదలయిన చూడవలసిన వింతలు మీకు తెలిసినవే. ఇవి నిత్య వింతలు.

ఇవికాక స్థానిక రవీంద్రభారతి, గాంధీ భవనాలలో నిత్య గానసభలు, ప్రసిద్ధ కళాకారులచే నాటకాలు వగైరా జరుగుతూనే వుంటాయి.

ఇంక నగరానికి ఎక్కడో, ఏ మూలో, ఎప్పుడూ ఓ సర్కస్ డేరా వుంటూనే వుంటుంది.

ఇవన్నీగాక ప్రతిఏటా జనవరి 1 వ తేదీ నుంచి ఫిబ్రవరి 10 వ తేదీవరకు హైదరాబాద్ ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో బ్రహ్మాండమైన అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శన భారీఎత్తున కన్నుల పండువగా జరుగుతూ వుంటుంది.

ఆ రోజు జనవరి 26 వ తేదీ, సాయంత్రం 4 గంటలయింది. మా కాలనీ వాళ్ళందరం కలిసి ఎగ్జిబిషన్ చూద్దామని నిర్ణయించుకున్నాము. మాతో ముఖ్య అతిథిగా మా ప్రక్కవీధిలోని నా స్నేహితుడు శ్రీధర్, వాళ్ళమ్మగారు కూడా వచ్చారు.

సరే అంతా కట్టకట్టుకుని టిక్కెట్లు కొనుక్కుని లోపలికి దూరాము. ప్రతిష్టాలూ చూసుకుంటూ ఎగ్జిబిషన్ అంతా తిరుగుతూ ఎవళ్ళకి కావలసిన వస్తువులు వాళ్ళు కొనుక్కుంటున్నారు. నేను మాత్రం ఎగ్జిబిషన్ చూడడం మాట అటుంచి, నా మాటిమాటికి పనికివచ్చే వస్తువుల గురించి సెవులన్నీ గాలిస్తూ, ఆఖరుకి ఓ స్టాల్లో మంచి రంగుల్లోవున్న నైలాన్ సిల్కు కట్‌పీస్... ... డజను కొన్నాను.

రామాయణంలోని సుమిత్ర — ధర్మపథం — బులుసు వేంకటరమణయ్య

దశరథ మహారాజు భార్యలు ముగ్గురిలో ఒక్కొక్కరి స్వభావం వేర్వేరుగా కాన వస్తుంది. కౌసల్యాదేవి అధీర. ఆమె, తన కుమారుడు శ్రీరాముడు అడవికిపోతూ ఉంటే దుఃఖం పట్టలేక పోయింది. ఇదివనితల సహజ స్వభావం. కైకకు ధైర్యమూ, అధైర్యమూ– రెండూ ఉన్నవి. తన కుమారుడు భరతుడు రాజు కావాలనే కోరికతో ఆమె ధైర్యంగా భర్తను తనకు వాగ్దానం చేసిన రెండువరాలనూ అడిగింది. రాముడు పట్నం విడిచి పోతూ ఉండగా ఎంతో తృప్తి పడింది. కాని ఆ పిదప జరిగిన సంఘటనలనుబట్టి ఆమె ధైర్యం దిగజారి పోయింది. పశ్చాత్తాపంకూడా కలిగింది భరతుని ప్రార్థన మన్నించి శ్రీరాముడు చిత్రకూటంనుండి వెనుకకు మరలివచ్చి రాజ్యం స్వీకరిస్తే ఆమె తిరిగి సౌఖ్యం కలుగచేసి కొనేది కాదు.

ఇకసుమిత్రను తీసుకుందాం. ఆమెఎంతో ధైర్యం కలది. తమకనే కన్న కొడుకును సీతారాములవెంట అడవికి పంపగలిగినది. మరి ఏతల్లి అయినా మనసారా అలా చేసి ఉండదు. తన కుమారుడు అడవికి పోతున్నందుకు కౌసల్యాదేవి ఎంతో బాధపడి దుఃఖిస్తూ వుండగా సుమిత్ర ఆమెకు ధైర్యం చెప్పతూ ఏమన్నదో గమనించండి–

కీర్తిభూతాం పతాకాంయో
లోకే భ్రమయతి ప్రభుః,
ధర్మసత్యవ్రతధనః
కిం న ప్రాప్తస్తవాత్మజః,

[అమ్మా! నీపుత్రుడు ఇక్కడనే ఉండే కన్న పై చోటుకి వెళ్ళితేనే మంచిది. అతడు ధర్మం, సత్యం పాలించడానికి వెళుతున్నాడు ఆతని కీర్తిపతాక రెపరెపలాడుతూ లోకంలో నలువైపులా తిరగగలదు ఇదే కదా ధనం కంటె గొప్పది? ఇక అతనికి ఇక్కడ లేనంత మాత్రాన లోటు ఏమి ఉంటుంది?]

"దైవతం దైవతానాంచ
భూతానాం భూతసత్తమః,
తస్య కేహ్యగుణా దేవి
రాష్ట్రే వాప్యథవా పురే."

[రామునికి ఎవరివల్లనూ కష్టం కలుగుతుందేమో అనే భయం నీకు ఎంత మాత్రమూ అక్కరేదు. అతడు దేవతలకు దేవత! ప్రాణులందరికీ ప్రాణంవంటివాడు. అట్టివాడు అందరికీ హితుడే. విరోధులు ఎవ్వరూ ఉండరు ఆయన ఈ పట్టణంలో ఉన్నాసరే, లేదాయితర ప్రదేశాలలో తిరిగినా సరే! ఎట్టి ప్రమాదమూ ఉండదు.]

సుమిత్ర ఈ విధంగా ధైర్యం చెప్పి కౌసల్యాదేవి విచారాన్ని తగ్గించింది. శ్రీరాముడు తిరిగి వచ్చేవరకూ 14 ఏళ్ళూ ఆమెను అన్ని విధాల కనిపెట్టుకొని భద్రంగా చూస్తూనే ఉండినది.

---

## మాయాజాలం మతికట్టు

శ్రీధర్ బామ్మగారు మాత్రం ఓ దుకాణదారుతో సరదాగా గొడవ పెట్టుకుని వాడుచెప్పిన ఖరీదుకి సగం తగ్గించి బేరమాడి ఓ రాచిప్పకొని పట్టుకోమని శ్రీధర్ చేతిలో పెట్టింది.

అట్లా మేమంతా ఓ గంటన్నరసేపు కాళ్ళు పీకేవరకు ఎగ్జిబిషన్ అంతా తిరిగి, విశ్రాంతి తీసుకుందామని ఓ ఖాళీప్రదేశానికి చేరి మేము తెచ్చుకున్న చిరుతిళ్ళు తింటూ కబుర్లలోకి దిగాము.

ఇంతలో శ్రీధర్ బామ్మగారు, తన కాళ్ళు నొక్కుకుంటూ నావైపే బుస్సుమంటూ చూస్తూ "ఏమిటి నాయనా కామేషూ! ఇట్లాంటి ఎగ్జిబిషన్‌కి అందర్నీ బయలుదేర దీశావ్? పెద్ద ఎగ్జిబిషనె పెట్టారు. కాని చీరల షాపులు, పేలాలు (పాప్‌కారన్), మిర్చీ బజ్జీలు తప్ప ఏమీ లేవు! మా కాలంలో తిరునాళ్ళే వెయ్యిరెట్లు నయం. ఏమైతేనేం అంతా యింటికి కాళ్ళ నొప్పులు కొనుక్కెళ్ళుతున్నాం. ఏదో ఒహటి కొనుక్కెళ్ళాలిగ" అంటూ గొణుగుతూ సాధించడం మొదలెట్టింది.

వెంటనే శ్రీధర్ "ఏయ్ కామేష్, మా బామ్మ అసలే పాతకాలం మనిషి. వాదనత్వం ఎక్కువ. ఇంత పెద్ద ఎగ్జిబిషన్ చూసి కూడా ఇంప్రెషన్ కాలేదు. రేపట్నుంచి మా యింటికి వచ్చావంటె అసలు కాఫీ నీళ్ళుకూడా యివ్వదు. జాగ్రత్త! కాబట్టి బామ్మని గుడ్ మూడ్స్‌లో వుంచడానికి ఆశ్చర్యపోయేలా ఏదో ఒకవింత చూపెట్టు" అన్నాడు.

నేను 'సరే' అనగానే అంతా వలయంగా చేరి కూర్చున్నారు.

ఇంతలో ఆలోచించసాగాను.

వెంటనే నాకొక ఐడియా తట్టింది!?

నేను ఎగ్జిబిషన్‌లో కొన్న సిల్కు కట్‌పీసెస్‌లలో మూడు ఎరుపురంగు సిల్కు గుడ్డల్ని ఒకదానితో ఒకటి ముడివేసి అందరికి కనిపించేలా ఓ ఖాళీ సంచీలో వేశాను. తర్వాత మూడు పచ్చరంగు సిల్కు గుడ్డల్ని చూపించి ఇంకో సంచిలో వేసి బామ్మగార్ని చప్పట్లు కొట్టమన్నాను.

అంతే! ఇంకేముంది!! ఆశ్చర్యం!!!

మొదటి సంచిలో వేసిన మూడు ఎరుపు రంగు సిల్కులు ముళ్ళు లేకుండా విడిపోయి, విడివిడిగా రెండవ సంచీలో వేసిన పచ్చరంగు సిల్కుగుడ్డలు ఒకదానితో ఒకటి ముడి వేయబడి వుండడం చూసి బామ్మగారితోసహా అంతా ఆశ్చర్యపోయారు.




ముడివేసిన ఎరుపు సిల్కు గుడ్డలు విడిపోవడంలోని రహస్యం 2, 3 చిత్రాలలో చూపిన విధంగా ముడివేసి 1వ చిత్రంలో చూపిన విధంగా పట్టుకుని గట్టిగా ఎదల్చడంలో వుందని వాళ్ళకి తెలీదుగా!

ఇకపోతే మూడు పచ్చరంగు సిల్కు గుడ్డలూ మామూలుగా ఒకదానితో ఒకటి గట్టిగా ముడివేసినట్టుదికి ఎదురుగా కాక, ప్రక్కగామున్న కొనల్ని పట్టుకుని చూపిస్తే ముళ్ళు మడతల మధ్యనాగి సిల్కులు మాత్రం చూసేవారికి విడివిడిగా వున్నట్టుగానే తోస్తాయి. మిగతా వ్యవహారం మీకు తెలుసుగ!

# రాగమాలిక

## శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

*(గత సంచిక తరువాయి)*

"మరేంలేదు మీకు నన్ను చేసుకోడం ఇష్టమా కాదా అని తెలుసుకుందామనే అట్లాఅడిగాను నాకు మాత్రం మిమ్మల్నే తప్ప కుండా పెళ్ళాడాలని వుంది ఇది చెబుదామనే మీతో మాట్లాడాలన్నాను మీ కిష్టమైతే మన పెళ్లి జరిగినట్లే"

"     "

"ఏమంటారు ?"

"....  "

"నేను మిమ్మల్ని మొదటి చూపులోనే ప్రేమించాను "

"  .  "

"నిజం !" లేచి నిలబడి నా దగ్గిరగా వచ్చాడు

నేను చటుక్కున కుర్చీలోంచి లేచాను

వాకిలివైపు వడవబోయాను.

వాకిలి కడ్డంగా నిలబడ్డాడు అతడు

నా గుండె జల్లుమంది !

"నాకు జవాబు చెప్పి వెళ్ళండి ప్లీజ్ !"

బతిమాలుతున్నట్లు అడిగాడు

కళ్లెత్తి అతడి కళ్ళల్లోకి చూశాను వల్లీ దించేశాను

"మా నాన్న చెప్తారు జవాబు " ఒక్కంగలో ఇవతలికి వచ్చేశాను

లోపలికి వెళ్లబోతూ వెనక్కి తిరిగి చూశాను ఒక్కసారి

"జవాబు నాకు తెలిసిపోయిందిలెండి !" చిలిపిగా నవ్వుతూ అన్నాడతడు చిన్నగా !

ఆ నవ్వు ఇప్పటికీ నా గుండెల్లో నిలిచి పోయింది శాశ్వతంగా !

నన్ను జీవింపచేసే మధురస్మృతుల్లో అది ఒకటి !

తరువాత నెలకే మా పెళ్లి జరిగింది ఎంతో వైభవంగా చేశారు నాన్న, అన్నయ్య మా పెళ్లి !

నాకు, ఆయనకీ ఎన్నెన్నో కానుకలు ఇచ్చారు !

పెళ్లవంగానే హనీమూన్‌కి వెళ్లాం

నన్ను 'చండిక' అని పిలవడం మొదలుపెట్టా రాయన

బెంగుళూరు, మైసూరు, ఊటీ వెళ్ళి వచ్చాం మైసూరు బృందావన్ గార్డెన్స్‌లో మేము గడిపిన రోజులు, ఊటీలో మా మధురానుభవాలు వర్ణింపలేనివి నిజంగా అదొక స్వర్గలోకమే. ఆయనతోడిదే నాలోకం అయింది ! ఆయనకి నేనంటే ప్రాణం ప్రతిదానికీ సర్దుకుపోయేవారు తనే ! ఏ పనీ నన్నడగందే చేసేవారు కాదు నా కిష్టంలేదని చాలా అలవాట్లు వదులుకున్నారు కూడా !

రోజులు క్షణాల్లాగా దొర్లిపోయేవి

మా అన్యోన్యానురాగానికి నాన్న—అన్నయ్య—వదిన చాలా సంతోషించేవారు

నాకు నెల తప్పింది ఆయన సంతోషం — చెప్పకర లేదు నన్ను పువ్వులా చూసుకునేవారు — అప్పటినించీ ! నాకు మరీ గారాబం ఎక్కువయింది వంట మనిషిని పెట్టారు నా కసలు పనే లేకుండా పోయింది ఆఫీసు వదలంగానే నా దగ్గిరికొచ్చి వాలేవారు ! "నాకు పని లేకపోతే విసుగు పుడుతోం దండీ — నేనేం చెయ్యాలి ?" అని నేను కృత్రిమ కోపంతో అడిగితే —

"నా గురించి ఆలోచిస్తూ కూర్చో — లేదా చిన్నపిల్లల గురించి పుస్తకాలు చదువు --" అని ఎన్నో పుస్తకాలు కొని తెచ్చేవారు

నిజంగానే ఆ పుస్తకాలు చదువుతూ — నా కడుపులోని పాపాయిని తల్చుకుంటూ ఊహా లోకాల్లో తేలిపోయేదాన్ని !

రోజూ ఎక్కడికో — అక్కడికి తీసికెళ్లేవారు ఆ రోజుల్లోనే వదినకి ఆడపిల్ల పుట్టి పోయింది అది చూసి నేను చాలా బాధపడ్డాను భయపడి పోయాను అనేక విధాలయిన ఆలోచనలు కదిలేవి నా మనసులో నాకూ అట్లా అవుతే—? అనిపించేది కానీ పైకి చెప్పేదాన్ని కాదు నా మనసు గ్రహిం చిన ఆయన నన్ను కొన్నాళ్ళు వాళ్లి అక్కదగ్గిరికి తీసికెళ్లి వదిలారు. ఆవిడ నన్నెంతో అపురూపంగా చూసుకుంది ఎంతో ధైర్యం చెప్పింది లేడీ డాక్టరుకి చూపించి — ఆవిడచేత గూడా ధైర్యం చెప్పించింది. నాకు నెలలు నిండాయి

నాన్న, అన్నయ్యల కోరికమీద పుట్టింటికే వెళ్లాను పురిటికి.

వదిన ఎంతో ఆప్యాయంగా ఆదరించింది సమస్తమూ అమర్చిపెట్టింది కావలసినవి చేసిపెట్టింది కన్నతల్లిలా చూసుకుంది.

పుట్టింటివారూ, అత్తింటివారూ గూడా పసుపుకుంకుమ ఘనంగా చేశారు

పురుడు ఆస్పత్రిలో ఏర్పాటు చేశారు.

ఆడపిల్ల పుట్టింది

పిల్ల ముమ్మూర్తులా తండ్రి పోలికే అన్నారు అంతా !

ఆయన రోజూ ఆస్పత్రికి వచ్చి కూచునేవారు

పిల్లకి ఏదో నక్షత్ర శాంతి వుంది — తండ్రి చూడ గూడదన్నారు ఈయన చూడాలని తహతహలాడిపోయారు

ఆయన వచ్చినప్పుడల్లా పిల్లకి కప్పి వుంచేదాన్ని పదకొండోరోజున 'బాలసారె' జరిగింది 'సుధామయి' అని పేరు ఇద్దరం కలిసి సెలెక్ట్ చేసినా ఎక్కువ యిష్టం నాదే దాంట్లోగూడా !

అందరూ పేరు చాలా బావుందన్నారు

దానికి ఎన్ని కానుకలో ! నాన్న కొన్ని,

***జరిగిన కథ - 11.*** నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నిద్రపట్టని జీవితం మంజులది. సంవత్సరమంతా అంధకారంలో గడిపే మంజుల జీవితంలోకి వెలుగుని తెస్తారు శలవులకి ఇంటికొచ్చే సుధ, మధులు కానీ అందులోనూ అసంతృప్తే కొడుకు వస్తే కూతురో, కూతురువస్తే కొడుకో ఎవరో ఒకరు తండ్రిదగ్గర కెళ్లిపోతారు. ఇద్దరూ ఎప్పుడూ కలిసిరారు చిన్ననాటి స్నేహితుడు రామం కలసి గుర్తుపడ్తాడు మంజులని రామం భార్య రాధ. బారసాల చేసుకున్న తర్వాత భార్య సుశీలని తీసుకుని చెల్లెలు మంజుల దగ్గరికి వస్తాడు రాజా మధు అనారోగ్యం మంజులని మరింతగా కృంగదీస్తుంది రామంతో పెళ్లి కాకముందు తనకోసారి పెళ్లయిందని రాధ నోట విని ఆశ్చర్య పోతుంది మంజుల రాధ సంగతంతా తెలిసే పెళ్లి చేసుకున్నానుగానీ ఆమె కోసారి పెళ్లయిందనే విషయం నన్నామెపట్ల రాక్షసుడిలా ప్రవర్తించేలా చేసేది అని మంజులతో చెప్తాడు రామం నీ కడుపులో బిడ్డకి తాను తండ్రి కాదన్న రామం మాటలకి మానసికంగా దెబ్బతిన్న రాధ మృత శిశువుని ప్రసవిస్తుంది నువ్వూ, నాన్న కలిస్తే చాలా బావుంటుందమ్మా అంటూ ఉత్తరం రాస్తుంది సుధ మంజులకి అమ్మా నాన్నకీ నీకూ మధ్య అసలేం జరిగింది ? యెందుకు విడిపోయారు అని అడుగుతుంది సెలవులకి యింటికొచ్చిన సుధ తనతో కలసి బతకటానికి విముఖత చూపిన రాధని మంజుల దగ్గర దింపుతాడు రామం మంజుల సహచర్యం రాధలో మార్పు తీసుకొస్తుంది రాధకు ఆడపిల్ల పుడుతుంది తన భర్త ప్రేమించి పెళ్లి చేసుకున్న ఆమె క్షయ వ్యాధితో మరణించిందని తెలిసి కలవరపడుతుంది మంజుల భర్త వుద్యోగానికి రాజీనామా యిచ్చి ఎక్కడికో వెళ్లిపోయాడని తెలిసి బాధపడుతుంది మంజుల మధు, సుధలని చూడటానికి బయల్దేరిన మంజులకి గతం గుర్తుకొస్తుంది

అత్తగారు కొన్ని మొత్తానికి ఎన్నో నగలు వచ్చాయి! గౌన్లు రకరకాలు!

సుధ పుట్టాక మేము పూర్తిగా ఈ లోకాన్ని మర్చిపోయాం రోజులు ఎట్లా గడిచాయో గూడా తెలీలేదు మాకు!

సుధకి అన్ని వేడుకలూ జరిగాయి ఉయ్యాల్లో వేయడం — బోర్లపడితే బొబ్బట్లు చెయ్యడం, అన్నప్రాసన అన్నీ బాగా జరిగాయి అన్నిటికీ వాళ్ల నాన్నదే ఉత్సాహం అంతా!

దానికి అన్నప్రాసన అయిన వారానికే మా నాన్న పోయినారు నాకు బుద్ధి తెలిశాక, విషాదం అనుభవించింది అప్పుడే! అమ్మ నా చిన్నప్పుడే పోయింది వదిన వచ్చాక నాకు అమ్మలేని లోటే తెలీలేదు!

నాన్న పోయిన దెబ్బకి నేను తట్టుకోలేక పోయాను

అప్పుడాయన నన్ను గుండెల్లో దాచుకుని ఓదార్చారు

"నీకు తల్లీ, తండ్రీ అన్నీ నేనే ఇకనించీ" అన్నారు

నిజంగానే ఆయన అప్పట్నించీ నన్నింకా శ్రద్ధతో ఏమాత్రం నొప్పించకుండా చూసుకునేవారు నన్నెప్పుడూ ఒంటరిగా వుండనిచ్చేవారు కాదు

సుధకి ఏడాది నిండకముందే ఈయనకి ఇంగ్లండ్‌లో రిసర్చికి స్కాలర్‌షిప్ వచ్చింది వెళ్తానన్నారు నేనే వద్దన్నాను

"ఈ పరిస్థితిలో మిమ్మల్ని వదిలి నేనుండలేనని" ఏడ్చాను ఇంకా కొన్నాళ్లయ్యాక చూద్దామన్నాను

నా మాటని మన్నించారాయన ఆ ఏడాది వెళ్లలేదు

సుధకి వచ్చీరాని మాటలు వస్తున్నాయి

"నాన్నా!" అని అది పిల్చినప్పుడు పరవశించిపోయేదాన్ని నేను

ఆయన సరేసరి!

నాకు మళ్లీ నెవిళ్లు మొదలయ్యాయి

సుధకి రెండేళ్లు నిండాయి మధు పుట్టాడు

కొడుకు పుట్టాడని ఇద్దరం సంతోషించాం

ఏ మార్పులూ లేకుండా మా సంసారనౌక హాయిగా సాగుతోంది పిల్లల చిలిపి అల్లరితో— చిలుక పలుకులతో పరవశించిపోయేవాళ్లం మధు రెండేళ్లవాడయ్యాడు సుధకి నాలుగేళ్లు వచ్చాయి నర్సరీలో చేర్పిద్దామనుకుంటున్నాం ఇంగ్లండు ఛాన్సు ఆయనకి మళ్లీ వచ్చింది ఈసారి తోసిరాజనడం తెలివితక్కువతనం అన్నారు

"అదృష్టం ఒక్కసారే తలుపు కొడుతుంది తలుపుతీసి అది అందుకోబోతే ఇంక జీవితాంతం అది అందదు" అంటూ చెప్పారు

నేనూ కాదనలేదు సరేలే ఏడాది యెంతలో గడుస్తుంది? అనుకున్నాను

కానీ, ఆ ఏడాది ఎడబాటే మాకు శాశ్వత ఎడబాటు అవుతుందని అప్పుడు అనుకోలేదు అనుకుంటే అసలాయన్ని వెళ్లనిచ్చేదాన్నేకాదు

ఆయన ప్రయాణం ఖాయమైంది

ఈసారి వచ్చింది స్కాలర్‌షిప్ కాదు — ఆఫీసువాళ్లే ఈయన్ని పంపిస్తున్నారు ఏదో ట్రెయినింగ్‌కని — ఒక ఏడాది!

నన్ను, పిల్లల్ని క్షణం వదిలి వుండడం లేదాయన చాలా ఢీలాపడిపోతున్నారు

నాకూ ఎంతో దిగులుగ వుంది కానీ— ఆయన ఆ ఫారిన్ వెళ్లి తిరిగివస్తే జీతం— హోదా కూడా పెరుగుతాయిట పిల్లల్ని ఇంకా బాగా పెంచచ్చు — అన్నీ నాకు నేనే చెప్పుకుని నన్ను నేనే ఓదార్చుకున్నాను ఆయనకీ ధైర్యం చెప్పాను

అప్పటికి నాకు మళ్లీ రెండో నెల! ఆయన ప్రయాణం రేపే అన్నీ సర్దుకుంటున్నారు నేను సహాయం చేస్తున్నాను ఇంతలో కింద పిల్లవాడు కెవ్వుమన్నాడు

ఏమైందోనని కంగారుపడుతూ కిందికి పరుగెత్తాను ఆ పరిగెత్తడంలో కాలు జారింది నాలుగు మెట్లు దిగకుండానే దొర్లి కిందపడి పోయాను నా వెనకే వస్తున్న ఆయన హడావిడిగా నన్ను లేవనెత్తి మంచంమీదికి చేర్చారు డాక్టరుకి ఫోను చేశారు ఆవిడ వచ్చింది

నన్ను హాస్పిటల్‌కి తీసికెళ్లాలంది

వెంటనే హాస్పిటల్‌లో జాయినయ్యాను.

నాకు 'అబార్షన్' అయింది

ఆయన దిగజారిపోయారు కళ్లనీళ్లు పెట్టుకున్నారు

డాక్టరు ఏం ఫరవాలేదంది

రెస్టు కావాలంది

ఆయన ప్రయాణం అనేది అసలు మానేస్తానన్నారు ఫారిన్ నన్నొదిలి వెళ్లనన్నారు

అన్నయ్య ఎంతో ధైర్యం చెప్పాడు

"మీకెందుకు బావా, నేనూ — సుశీలా చూసుకుంటాం మంజుని! మీరు వెళ్లిరండి—" అన్నాడు

"అవునండీ — అంతా రెడీ అయాక యిప్పుడెందుకు మానెయ్యడం? వెళ్లిరండి. నాకేం ఫరవాలేదు" అన్నాను నేనుకూడా!

ఆయన వెళ్లకూడదనీ — వుండిపోతే బావుండునని మనసులో అనిపిస్తూనే వుంది ఆయన నాకు దూరంగా వెళ్లిపోతారనే ఊహే భరించలేక పోతున్నాను నేను

"ఏమిటో మంజూ — ప్రయాణం ముందు యిట్లా అవడం — అందులో నీకు — ఇదేమంత



ఎభసూ. కంగా లేదు పోనీ ప్రస్తుతానికి వెళ్లను చూద్దాం వచ్చే యేడు " అన్నారాయన

"వద్దండీ — వెళ్లిరండి ఇప్పటికే ఒకసారి కాదన్నారు మళ్లీ యిప్పుడూ వెళ్లకపోతే — ఇంకోసారి ఈ అవకాశం వస్తుందో — రాదో — నా మాట విని మీరెళ్లండి నన్ను చూసుకోడానికి అన్నయ్య - వదిన — ఉన్నారు —"

నాకు కళ్లనీళ్లు వచ్చాయి.

ఆయనా విగ్రహించుకోలేకపోయారు నన్ను పొదివి పట్టుకుని కన్నీరు కార్చారు. ఆ క్షణం మా జీవితంలో ఎంత విలువైనది!

మా అనురాగ మాలికలో అతి ముఖ్యమైన పువ్వది!

నేను కాస్త లేచి తిరిగేవరకు తన ప్రయాణం వాయిదా వేసుకున్నారాయన.

నా పనులన్నీ స్వయంగా ఆయనే చేశారు — నాకెంతో సేవ చేశారు పిల్లల్ని చూసుకోడం — వాళ్లని నిద్రపుచ్చడం — వాళ్లకి అన్నం పెట్టడం— అన్నీ ఆయనే చేశారు

వదిన వారిస్తే — "ఇదే నాకు తృప్తమ్మా - ఇప్పుడన్నా చెయ్యనీ —" అన్నారు

తరవాత పదిహేను రోజులకి వెళ్లారు. ఆయన వెళ్లే ముందు రోజు అత్తగారు — మా ఆడబడుచు — వచ్చారు

అందరం 'ఎయిర్‌పోర్ట్'కి వెళ్లాం

ఆయన ఎక్కిన విమానం కదిలి వెళ్తుంటే నేను దుఃఖాన్ని ఆపుకోలేకపోయాను.

ఇంటికొచ్చి పిల్లల్ని పట్టుకుని బావురుమన్నాను — అప్పుడే తెగిపోయింది మా బంధం — కానీ నాకు తెలీదు

అన్నయ్య — వదిన — అత్తగారూ వాళ్లు నన్ను కోప్పడ్డారు

ఆయన వెళ్లిపోయాక కాలం స్తంభించి పోయింది నాకు! కొన్నాళ్లవరకూ — ఈ లోకం లోకి రాలేకపోయాను నేను

అత్తగారు మరో వారం వుండి వెళ్లిపోయారు మా ఆడబడుచు అప్పుడే వెళ్లిపోయింది. మేము హైద్రాబాద్‌లో వుంటున్న ఇల్లు ఖాళీ చేసి అన్నయ్య నన్ను — పిల్లల్ని బెజవాడ రమ్మన్నాడు— ఆయన వచ్చేదాకా కానీ నేను వినలేదు.

ఆయన లేని ఈ ఏడాదీ నేను వేస్ట్ చెయ్యదలుచుకోలేదు బి.ఇడి. చదువుతానన్నాను. పని మనిషిని — వంట మనిషిని—పెట్టుకుని—బి.ఇడి.లో జాయిన్ అయ్యాను. సుధని నర్సరీ స్కూల్లో చేర్పించాను. మధుకి పనిమనిషి దగ్గిర అలవాటయింది ఆయన వారానికో ఉత్తరం రాసేవారు

నేను బి ఇడి లో చేరతానని రాస్తే ఆయన రాసిన జవాబు —

"ప్రియమైన నా రాణీ — మంజూ!

నీ ఉత్తరాలే నాకు జీవం పోస్తున్నాయి. నిన్ను విడిచి వుండలేనని ఇప్పుడు బాగా తెలుసుకున్నాను. అబ్బ — ఇంకా ఎన్నాళ్లు గడపాలో — ఎన్ని నెలలు గడవాలో — తల్చుకుంటే నిస్పృహగా — నిరాశగా వుంది.

ఈ ప్రదేశం చాలా అందమైంది. లండను చూశాను ఇంగ్లండు అంతా దాదాపు చూస్తున్నాను. ఇంత సుందరమైన ఈ ప్రదేశం చూస్తున్నప్పుడు నాకు ఒక్కటే లోటుగా వుంటుం నువ్వు నా పక్కనుంటే ఎంత బావుంటుంది? అదే లోటు నాకు

ఇక్కడ — ఎక్కడ చూసినా ఆడ — మగ జంటలే! ఆ జంటల్ని చూసినప్పుడల్లా నువ్వు నా సరసన లేవనే బాధ తీవ్రతరమౌతుంది. ఏమైనా సరే ఈసారి వస్తే నీతోనే కలిసి రావాలి! మనిద్దరం కలిసే ఈ ప్రదేశాలు చూడాలి.

పగలు నా పని నాకు సరిపోతుంది. రాత్రుళ్లు గడపడమే కష్టంగా వుంది ఇక్కడ చాలా చలి అలవాటు పడుతున్నాను.

భోజనం ఇక్కడ అలవాటు కావడం కష్టం. ముఖ్యంగా శాఖాహారులకి చాలా కష్టంగా వుంటుంది ఆపిల్సు—బ్రెడ్—కాఫీ—చాక్‌లైట్లు— ఉడికించిన కూరలతో కాలక్షేపం చేస్తున్నాను. అప్పుడప్పుడు ఇండియన్ హోటల్స్‌కి వెళ్తున్నాను.

నువ్వు పిల్లలు ఎట్లా వున్నారు? సుధ ముద్దు మాటలు, మధు ముద్దు మొహము గుర్తుకొస్తున్నాయి రోజూనూ! ఫొటోలోనే వాళ్లని — నిన్నూ చూసి సంతృప్తి పడుతున్నాను

నువ్వు బి.ఇడి.లో చేరతానంటున్నావు. ఎందుకు ఊరికే స్ట్రెయిన్? మనకేం తక్కువని నువ్వుకూడా ఉద్యోగం చెయ్యాలి? అయినా నీకు ఆరోగ్యం బాగా చేకూరిందా? బాగా రెస్ట్ తీసుకోవాలి నువ్వు బి ఇడి.కి చాలా 'వర్క్' చెయ్యాల్సి వుంటుంది కదా? చేరకపోతే ఏం? అయినా నీ ఇష్టం. కానీ — ఆరోగ్యం జాగ్రత్త అశ్రద్ధ చెయ్యొద్దు పిల్లల్ని జాగ్రత్తగా చూసుకో

వెంటనే జవాబు రాయి. నీ ఉత్తరాల్లోని అమృతాన్ని తాగి నేనిక్కడ జీవిస్తాను. గుర్తుంచుకో, చదువులో పడి దేవిగారు ఈ దీనుడికి ఉత్తరాలు రాయడం ఆలస్యం చేస్తారేమో? కాస్త కరుణించండి! సరేనా? బై—బై—

నీవాడు,

మాధవ్"

ఆయన అప్పుడు రాసిన ఉత్తరాలు నా దగ్గర ఇప్పటికీ వున్నాయి

అవి రోజుకి ఎన్నిసార్లు చదువుకునేదాన్నో లెక్కలేదు

మొదటి మూడు నెలలూ సుదీర్ఘమైన ఉత్తరాలు వారానికి ఒకటి వచ్చేవి క్రమంగా ఉత్తరాల నిడివీ తగ్గింది, సంఖ్యా తగ్గింది క్లుప్తంగా రాసేవారు తరువాత మూడు నెలలూ పనిలో చాలా బిజీగా ఉన్నానని రాసేవారు కానీ ఉత్తరాల్లో, నాదీ పిల్లలదీ ఆరోగ్య విషయం మాత్రం శ్రద్ధగా రాసేవారు.

చివరి ఆరు నెలల్లో నాలుగు ఉత్తరాలే వచ్చాయి ఆయన దగ్గిర్నించి.

నేనూ నా చదువులో — పిల్లలతో బిజీగానే ఉండేదాన్ని

ఆయన వచ్చే రోజు దగ్గిరికొస్తోంది

నా బి ఇడి పరీక్షలయ్యాయి

బాగా రాశాను

ఆయన కోసం కళ్లు కాయలుకాచేలాగా ఎదురు చూస్తున్నాను

సంవత్సరం ఆయన లేకుండా ఎట్లా గడిపానో? తల్చుకుంటే ఆశ్చర్యం వేస్తోంది నాకే

ఆయన వచ్చే రోజు ఏ చీర కట్టుకోవాలో — ఏ నగలు పెట్టుకోవాలో — ముందే నిర్ణయించి పెట్టుకున్నాను

పిల్లలని ఎట్లా డ్రెస్ చెయ్యాలో ఆలోచించి పెట్టుకున్నాను

ఆయన వచ్చే రోజు రానేవచ్చింది

అన్నయ్య — వదిన వచ్చారు



అత్తగారికి ఒంట్లో బావుండడం లేదుట - ఆవిడ రాలేదు

మొగపిల్లంచీ ఆవిడకి కూతురంటే ప్రాణం— అందుకని ఎక్కువ కాలం అక్కడే వుండేది

ఆవిణ్ణి చూసి పోవాలంటూ ఆయన అక్కగారు కూడా రాలేదు

అందరం ఆయన్ని రిసీవ్ చేసుకోడానికివెళ్ళాం

ఆయన విమానంలోంచి దిగుతుంటే ఆనందంతో నా కళ్ళు చెమ్మగిల్లాయి

మరింత తెల్లబడి - అందంగా వున్నారాయన

నా మనసు పులకరించింది గర్వం ఆవరించింది — నన్ను నా భర్త ఫారిన్ రిటర్న్డ్ ఇంకేంకావాలి?

పిల్లల్ని అమాంతం ఎత్తేసుకుని ముద్దుల వర్షం కురిపించారాయన

ఆయన వచ్చిన తరువాత పదిహేను — ఇరవై రోజులు సంతోషంగా — ఉల్లాసంగా — ఉత్సాహంగా — ఆనందంగా గడిచిపోయాయి

పగలు-రాత్రీ తేడానే తెలీలేదు ఒకర్నొకరం అల్లుకుపోయాం మా అనురాగానికి—అంతులేదు— అనుకున్నాను

మా రాగమాలిక దేవ పారిజాతాలతో కూర్చింది అనుకున్నాను మా రాగమాలికలో అన్నీ సంతోష రాగాలే వున్నాయి అనుకున్నాను

వచ్చే పోయే జనం ఎక్కువయ్యారు

ఆయన నా కొంగు పుచ్చుకునే తిరిగారు

పిల్లలతో ఆడుకున్నారు

ఎంతో ప్రేమతో - ఆప్యాయతతో— చూసుకున్నారు మమ్మల్ని

మే మిద్దరం పిల్లలతో వెళ్ళి మా అత్తగార్ని చూసి — ఆవిణ్ణి తీసుకుని వచ్చాం మా దగ్గిరికి ఆవిడ కొడుకుని చూసి చాలా సంతోషించింది అందరం కలిసి రోజూ పండగలాగానే ఆనందంగా గడప సాగాం

నాకు అక్కణ్ణించి ఎన్నో బహుమతులు తెచ్చారు పిల్లలకి బొమ్మలు, గుడ్డలు — నాకు చీరెలూ, సెంట్లూ - వాళ్ళమ్మకి భక్తిగీతాలు రికార్డ్ చేసుకుని వినడానికి టేప్ రికార్డర్ - అన్నయ్యకి-మంచి షర్టులు— వదినకి గ్రైండర్— ఇంట్లోకి ట్రాన్సిస్టర్ కమ్—టేప్ రికార్డర్ - చాలా చాలా తెచ్చారు

ఆ స్వప్నలోకం నించి ఇంకా వాస్తవ లోకంలోకి రానేలేదు నేను

ఇంకా ఆ మత్తులోనే వున్నాను.

అప్పుడే ఆయన తనకి బొంబాయి ట్రాన్స్‌ఫర్ అయేలా వుందని అన్నారు కానీ హైద్రాబాద్ మాత్రం తరచు వచ్చిపోయే పనులు వుంటూనే వుంటాయన్నారు

'ఎక్కడున్నా మనిద్దరం ఒక్కచోటే వుండాలి —' అన్నారు

ఇరవై రోజులు గడిచాయి

ఒకరోజు అర్ధరాత్రి—

మేమింకా నిద్రపోలేదు ఆయన నాతో ఏవేవో తియ్యని కబుర్లు చెప్తున్నారు

నేను తన్మయత్వంతో వింటున్నాను.

అప్పుడు ఫోన్ మోగింది.

# రాగమాలిక

ఆయన విసుక్కుంటూ లేచి వెళ్ళి ఫోను ఎత్తారు

ఆ ఫోనులో మాట్లాడింది ఎవరో - ఏమో — ఆయన ముఖంలో రంగులు మారాయి

ఆత్రుత — ఆదుర్దా— పోటీ పడ్డాయి ఆయన వదనంలో

నాకు నిద్రమత్తుగావుంది

ఏవో ఆఫీసు విషయాల్లే అనుకున్నాను

ఆయన ఏం మాట్లాడిందీ వినలేదు పక్కకు తిరిగి పడుకున్నాను

పావుగంటయ్యాక తిరిగి మంచం దగ్గిరికి వచ్చారు నాకు కళ్ళుమూతకొచ్చేసింది నిద్ర,

"మంజూ — నిద్రపోయావా?"

"ఊఁ" అన్నాను కళ్ళు మూసుకునే తరువాత నాకు ఏమీ తెలీలేదు

ఎప్పుడు తెల్లవారిందో కూడా తెలీనంతగా పట్టేసింది నిద్ర!

పొద్దున ఆరు గంటలయింది అప్పుడొచ్చింది మెలకువ!

నేను నిద్రలేచేసరికి — ఆయన కుర్చీలో కూచుని వున్నారు

"అప్పుడే మీరు నిద్ర లేచారా?" అన్నారు ఆశ్చర్యంగా

**త్వరలో**
**ఇలా ఎందుకు జరిగింది?**
**ప్రారంభం!**

పిల్లలింకా లేవలేదు

ఆయనెప్పుడూ ఏడు గంటల పైనగానీ లేవరు లేచాక అంతా హడావిడే!

"ఊఁ!" అన్నారు పరధ్యాన్నంగా

ఆ పరధ్యాన్నం - ఆ కూర్చున్న తీరు — మొహంలో ఆ అలసట — మొహం మీదికి జుట్టు పడుతూ ? ఆయన రాత్రల్లా నిద్రపోయినట్లు లేదు.

కళ్ళు ఎర్రగా వున్నాయి

నాకు కంగారేసింది

"ఏమిటి — ఎందుకట్లా వున్నారు? ఒంట్లో బావుందా?"

జవాబే ఇవ్వలేదాయన ఒక్క క్షణం

"మంజూ — నాకు కాఫీ కావాలి! తల నొప్పిగా వుంది!" అన్నారు

కాఫీ యిస్తుండగా అన్నారు - "నేను అర్జంటుగా బొంబాయి వెళ్ళాలి—" అని!

ఆ రోజే బొంబాయి వెళ్ళిపోయారు

ఏదో ఆఫీసు పనే అనుకున్నానుగానీ — నాకు ఆయనమీద ఏమాత్రం అనుమానం రాలేదు

ఆ వెళ్ళడం -- వెళ్ళడం మరో పదిహేను రోజుల దాకా రాలేదు — తిరిగి

వచ్చాక మామూలుగానే వున్నారు

కానీ, అప్పట్నించీ బొంబాయికి రాకపోకలు ఎక్కువయ్యాయి

బొంబాయినించి ఫోన్ కాల్స్ కూడా ఎక్కువయ్యాయి

అయినా నేనేం పట్టించుకోలేదు

రోజులు గడుస్తున్నాయి ఆయన నాతో మామూలుగానే ప్రవర్తిస్తున్నా, మనసులో ఏదో విషయమై బాధపడుతున్నారని గుర్తించాను నేను

మనిషి చిక్కిపోతున్నారు రాత్రిళ్ళు సరిగ్గా నిద్ర పోయేవారు కాదు పరధ్యాన్నం గూడా ఎక్కువైంది

"ఏమిటి మీ బాధ? నాతో చెప్పగూడదా?" అని అడగాలనుకున్నాను

కానీ, ఆయనంత నన్ను దూరంగా, పరాయి దాన్నిగా భావించి చెప్పనప్పుడు నేనెందుకు అడగాలి? ఏం నాతో చెప్పి పంచుకోకూడదా — తన బాధ? ఉహూఁ! నేనూ దూరంగానే ఏం పట్టనట్లుగానే వున్నాను

కానీ, నా మనసు ఊరుకోదే? బాధపడుతూనే వుంది ఆయనన్నట్లా చూసినప్పుడల్లా విలవిలలాడుతూనే వుంది

అత్తగారు కాస్త ఆరోగ్యం చేకూరాక మేము వుండమన్నా, మళ్ళీ వస్తానంటూ కూతురి దగ్గిరికి వెళ్ళిపోయారు

నత్త నడకలాగా గడుస్తోంది కాలం

మూడు నెలలు గడిచాయి అట్లా

## 22

ఒకరోజు—

ఆయన ఆఫీసు నుంచి రాంగానే "మంజూ! రెడీ అవు సినిమాకి వెళ్దాం" అన్నారు

నేను రెడీ అయి పిల్లల్ని కూడా రెడీ చేశాను

"పిల్లలు వద్దు మనిద్దరమే వెళ్దాం పిల్లల్ని పనిమనిషి చూసుకుంటుందిలే" అన్నారు

ఆశ్చర్యంగా చూశాను

ఆ ధోరణి వింతగా తోచింది నాకు.

ఆయన ఫారిన్‌నించి వచ్చాక ఎక్కడికి వెళ్ళినా పిల్లల్ని వెంటబెట్టుకునే వెళ్ళేవాళ్ళం బయటికి వెళ్ళినప్పుడు ఆయన పిల్లలతోనే ఎక్కువ మాట్లాడేవారు నాకంటే — నాతోకంటేకూడా!

సరే, ఆయన మాట కాదనడం ఎందుకులే అని పిల్లల్ని పని మనిషికి అప్పజెప్పి బయల్దేరాను

దార్లో ఏం మాట్లాడుకోలేదు

సినిమాహాల్లో వెళ్ళి కూచున్నాం

ఇంగ్లీషు సినిమా అది! నేను సినిమా కుతూహలంగా చూస్తున్నాను సగంలో —

"మంజూ! వెళ్దాం పద" అన్నారాయన!

"అదేమిటండీ? వచ్చాక చివరిదాకా చూడకుండా..."

నా మాటని మధ్యలోనే తుంచేస్తూ— "నీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడాలి పద వెళ్దాం"

నన్ను చెయ్యిపట్టి లేవదీశారు

మాట్లాడకుండా ఆయన వెనక నడిచాను

ఇద్దరం బయటికొచ్చాం

పబ్లిక్ గార్డెన్స్‌లోకి తీసుకొచ్చారు నన్ను!

"ఏమిటండీ? ఇప్పుడు రాత్రి తొమ్మిదవుతోంది! ఎందుకిక్కడ? ఇంటి కెళ్దాం పదండి! అక్కడే మాట్లాడుకోవచ్చు అన్నీ"

కుందాం! కమాన్ డియర్!'' అన్నాడు షరీఫ్ ముందుకు నడుస్తూ.

''టాప్ ఫ్లోరా? ఈ లాడ్జికి లిఫ్టు లేదు! అంత ఎత్తు పైకి నేనెక్కలేను!'' అంది మారాము చేస్తున్నట్టు, జీనత్.

''మూడో అంతస్తే ఎక్కలేనిదానివి - డార్జిలింగ్ కొండలెక్కి 'సర్టిఫికేట్' ఎలా సంపాదించావ్! పోనీ అంతగా ఎక్కలేకపోతే నేనే పైకి ఎత్తుకెళ్ళనా? కమాన్!'' అన్నాడు, నిజంగానే జీనత్‌ను ఎత్తుకోబోతూ

జీనత్ కంగారుపడి, ''అబ్బబ్బ! మీతో చావుకొచ్చింది! నేను రాగలను! పదండి'' అంది.

ఎర్రటి క్రేప్ సిల్కు చీరెమీద, అదే రంగు బ్లౌజ్‌తో, పచ్చటి పసిడిఛాయతో, ముద్దులు మూటగట్టే జీనత్‌ను చూసి —

''షర్మిలా ఠాగూర్ గుర్తూ!'' అన్నాడు రిసెప్షనిస్టు దగ్గరున్న రూమ్‌బాయ్, తన తోటివాడితో, మెల్లిగా సంజ్ఞ చేస్తూ! జీనత్‌కు, ఆ మాటలు వినబడి చీరెకొంగు తలమీదనుంచి కప్పుకొని, నల్ల కళ్ళజోడు పెట్టుకుంది, సిగ్గుతో మొగ్గయిపోతూ!

మూడో అంతస్తులో రూమ్‌బాయ్ గది చూపించి వెళ్ళగానే.

''ఏం పనులండి యివి? మనం పట్ట పగలే రూమ్ తీసుకొని లాడ్జిలో గడిపామని తెలిస్తే మా అమ్మావాళ్ళేమనుకుంటారు?'' కోపంతో బుంగమూతిపెట్టి అడిగింది జీనత్

''ఇంట్లో నచ్చక — అలా వెళ్ళారనుకుంటారు!'' 'వెల్‌కం టు యు' — అంటున్న యూఫోమ్ బెడ్‌కు యింకా దూరంగా ఎందుకున్నారని కోప్పడతారు! రా డియర్!'' అంటూ జీనత్‌ను దగ్గరకు తీసుకోబోయాడు — షరీఫ్

''అబ్బా వదలండి! ఏమిటిది ...!?'' చిరాకుపడింది జీనత్.

''ఏముంది! ఎయిర్ కండీషన్డ్ గదిలో చలి — చలిలో చెలి!''

''ఇదేనా నాతో అర్జంటుగా చెప్పాలన్న ముఖ్య విషయం! మీరు ఉదయం బజారుకని వచ్చి, ఈ రూమ్ బుక్ చేసుకొచ్చారా?''

''కూర్చో చెబుతాను!'' షరీఫ్ కాస్త రాజీ ధోరణిలో అన్నాడు

''మీరు అర్జంటుగా చెబుతానన్న ముఖ్య విషయం ఏమిటో — అది చెప్పేదాక కూర్చోను!'' అంది, జీనత్ పట్టుదలగా

''ఇదిగో ఈ కవర్ చూశావా?'' అంటూ ఓ కవరు జీనత్ చేతికిచ్చాడు, షరీఫ్

జీనత్ ఆ కవరు చూస్తూనే ''ఇది మీ యింటి అడ్రసుకు వచ్చిందని మీ అన్నయ్య రఫీగారు, మా ఇంటికి ఉదయం పంపిందేగా?'' అంది, అది గుర్తుపట్టి.

''ఆ కవరులో నేను నీకు చెబుతానన్న ముఖ్య విషయం వుంది! అక్కడ యింటి దగ్గర ఎవరైనా చూస్తే గొడవవుతుందేమోనని నీకు విషయం ఏమిటో — ఏ పరిస్థితుల్లో యిలా జరిగిందో కాస్త వివరంగా చెబుదామని యిక్కడికి పిలుచుకొచ్చాను!'' అన్నాడు షరీఫ్, కాస్త సీరియస్‌గానే.

జీనత్‌కు షరీఫ్ ధోరణిలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యం వేసింది.

''ఇంటి దగ్గర ఎవరైనా చూస్తే గొడవయ్యేది. నాకు మాత్రమే రహస్యంగా చెప్పదగ్గ విషయం, ఈ కవరులో వుందా!? ఏమిటో అది'' అనుకొని కవరు విప్పబోయింది జీనత్.

''జీనత్! నీ సంస్కారంమీద నాకు పూర్తి నమ్మకముంది! సహృదయంతో అపార్థం చేసుకోనని మాట యిచ్చి, ఆ కవరులో వున్నదేమిటో చూడు'' అన్నాడు షరీఫ్ ఏదో తప్పు జరిగిపోయింది, క్షమించు అన్న ధోరణిలో.

జీనత్‌కు యిక ఆతురత ఎక్కువైంది! ఆ కవరులో ఏముందో ఇక చూడకుండా వుండలేననిపించింది ఆమెకు.

వెంటనే కవరులోంచి కార్డుసైజు ఫొటో తీసింది!

అది చూస్తూనే ఆమె, ప్రక్కనే పిడుగు పడ్డట్టు 'షాక్'తో —

''ఏమిటండీ! ఈ ఫొటో ఏమిటి — ఈ అమ్మాయి ఎవరు? ఈ మెడలో దండలేమిటి?'' అంది మాటలు తడబడుతుండగా.

''జస్ట్ మేరీడ్!'' గొంతులో ఏదో అడ్డంపడ్డట్టు, అపాలజీ చెబుతున్నట్టు, మెల్లిగా గొణిగినట్టు చెప్పాడు షరీఫ్.

''ఏమిటి మీరనేది! అయితే, ఈ అమ్మాయిని మీరు మేరేజ్ చేసుకున్నారా? ఎవరీ అమ్మాయి?'' అడిగింది కంగారుగా

''ఒక ఎయిర్‌హోస్టెస్! మిస్ రీటా కపాడియా!''

''మీకు యిదివరకే పెళ్ళయివుంటే, మళ్ళీ నన్నెందుకు నట్టేట్లో ముంచారు! నేనేం ద్రోహం చేశానని నా గొంతు కోశారు?'' ఏడుపు పైకి పెల్లుబికి వస్తుంటే, ఆపుకోడానికి జీనత్ హ్యాండ్ కర్‌ఛీప్ నోటికి అడ్డం పెట్టుకుంది

''జీనత్! ప్లీజ్ నేను చెప్పేది విను! నన్నర్థంచేసుకో! తొందరపడకు!'' షరీఫ్ బ్రతిమాలుతూ జీనత్ చెయ్యి పట్టుకున్నాడు.

''చదువుకోని ఆ పాతకాలపుమూర్ఖులు, ఒక్కొక్కళ్ళు నాలుగైదు పెళ్ళిళ్ళు చేసుకున్నారని, చదువుకొని, లోకం తిరిగి, ఏది మంచో — ఏది చెడో నలుగురికి చెప్పవలసిన మీరు — పెళ్ళిమీద పెళ్ళికి సిద్ధపడ్డారా! ఈ విషయం చెప్పటానికేనా బజారు మనుషులు వచ్చిపోయే లాడ్జికి నన్ను లాక్కొచ్చారు! నేను యిక్కడ ఒక్కక్షణం వుండను!'' అంటూ కోపంగా, బయటికి వెళ్ళటానికి డోర్ హ్యాండిల్‌మీద, విసురుగా చెయ్యి వేసింది జీనత్.

''జీనత్! ప్లీజ్ వెయిట్! నేను చెప్పేది సాంతం విను...!'' అంటూ షరీఫ్ ఆమెను వారించటానికి ఆమె చెయ్యి బలంగా పట్టుకున్నాడు

''వదలండి! నన్నిక ముట్టుకోవద్దు! యింకో అడుగు ముందుకు వేశారా — బయటి జనం ఇక్కడ మూగేట్టు బయటికి వెళ్ళి గొడవ చేస్తాను!'' అంటూ పరిగెత్తి బయటకు పారిపోవాలన్న ఆతురతతో తలుపు విసురుగా లాగింది

ఎదురుగా, వాకిలి కడ్డంగా కనిపించిన ఆకారాలను ఒక్క ఉదుటను చూసి, మీట నొక్కినట్టు ఆగిపోయింది! ఆమెకు తెలియకుండానే ఆమె కాళ్ళు వెనక్కు వెనక్కు నడిచాయి!

కాని అంతలోనే ఆమె ధైర్యాన్ని కూడగట్టుకొని నిలబడింది!

''ఏం కావాలి?'' అడిగింది, ధృఢంగా

''ఈ లాడ్జిమీద కంప్లయింట్స్ వచ్చినయ్! అందుకే అన్ని గదులు చెకప్ చేస్తున్నాం! మీరు?. '' అన్నాడు హెడ్ కాన్‌స్టేబుల్ లోపల కొస్తూనే గుచ్చి గుచ్చి ప్రశ్నిస్తూ.

[36వ పేజీ చూడండి]

#  సినిమా విశేషాలు 

## తమిళనాడు ముఖ్యమంత్రికి అధిక్షేపణ... ఆక్షేపణ

తమిళ చిత్ర రంగానికి ''సూపర్‌స్టార్''గా రాణించిన శ్రీ ఎం. జి. ఆర్. ప్రజాబలంతో తమిళనాడు ముఖ్యమంత్రి అయ్యారు.

ఆయన ముఖ్యమంత్రిగా పదవీస్వీకారం చేసిన తరువాత, ఎందరో ఆశ్చర్యపడే విధంగా రాజ్యపాలన చేస్తున్నారు.

ముఖ్యమంత్రి గావడానికి ముందు కొన్ని చిత్రాలకు, శ్రీ ఎం. జి. ఆర్. తన ఆమోదాన్ని యిచ్చారట. వాటిని పూర్తిచెయ్యవలసిన బాధ్యత తనదిగా ఆయన పరిగణించి... మళ్లీ సినిమాల్లో నటించడానికి నిర్ణయించారు. తమిళనాడు ప్రతిపక్ష రాజకీయ నాయకులందరు శ్రీ ఎం. జి. ఆర్. పునఃప్రవేశాన్ని అధిక్షేపిస్తున్నారు. ఆక్షేపిస్తున్నారు.

ముఖ్యమంత్రి పదవిని నిర్వహించే పౌరుడు మరో వృత్తిని చేబూనడం... సమంజసమైన నిర్ణయం కాదు అని తమిళనాడు ప్రజలలో కూడా ఒక వర్గం ప్రచారం లేవదీసింది.

ఇలాంటి సంఘర్షణకు గురి అయిన ''సినిమా ప్రవేశం'' గూర్చి, ముఖ్యమంత్రి ఎలాంటి నిర్ణయాన్ని తీసుకుంటారో చూడాలి, మరి.

## మదరాసులో తెలుగు చిత్రాల షూటింగులు

1977 ఎంతో బెటర్ అనిపిస్తుంది, మదరాసులో తెలుగు చిత్రాల షూటింగులు.

1978 ప్రారంభం నుంచి యిప్పటివరకు పరిశీలిస్తే...ఒకటి...రెండు చిత్రాల షూటింగులు మాత్రమే మదరాసులో జరిగినట్లు గుర్తు.

హైద్రాబాదులో వున్న అన్నపూర్ణ... శ్రీ సారధీ... భాగ్యనగర్... రామకృష్ణ స్టుడియోలు చాలా బిజీగా వుంటున్నాయి గనక... వచ్చే సంవత్సరం మన పరిశ్రమ మన రాజధానీ నగరంలో స్థిరపడగలదేమో అనిపిస్తుంది.

శ్రీ ఎన్టీఆర్, శ్రీ ఏ.ఎన్.ఆర్, శ్రీ కృష్ణ, శ్రీ శోభన్ నాయకత్వం వహిస్తున్న చిత్రాలు, శ్రీ దాసరి చిత్రీకరణ చేస్తున్న చిత్రాలు హైద్రాబాదులో జరుగుతున్నవి నిజంగాబట్టే... వచ్చే సంవత్సరం మరింత పటిష్టం అయ్యేది తథ్యమేగదా !



'పంతులమ్మ'లో లక్ష్మి, రంగనాథ్



'ఏజెంట్ గోపీ'లో జయప్రద, కృష్ణ

## సామ్రాట్ యిచ్చిన నలభై

''చిరంజీవికృష్ణుడు'' శ్రీ అక్కినేనికి రాబోయే రెండు చిత్రాలు ఘన విజయాన్ని, అత్యధికమైన ప్రజాబలాన్ని సమకూర్చగలవని నిజం ఎరిగిన అందరు చెపుతున్నారు.

అగ్రదర్శకుడు శ్రీ దాసరి రూపొందించిన ''దేవదాసు మళ్లీ పుట్టాడు'' వర్ణ చిత్రం శ్రీ నాగేశ్వరరావుకు అలనాటి ''దేవదాసు''కు మించిన ఖ్యాతిని తేగల సత్తాను పొందియున్నది. (నిర్మాతలు శ్రీనివాసులు, పాండురంగప్ప.)

విక్టరీ శ్రీ మధుసూదనరావు చిత్రీకరణలో వస్తున్న ''విచిత్ర జీవితం'' వర్ణ చిత్రం ప్రేక్షకులకు నచ్చే అంశాలను గొనియున్నది. (నిర్మాతలు పద్మాక్షి, పుష్పాభట్.)

ప్రముఖ నిశ్చల ఛాయాగ్రాహకుడు ''జైహింద్ సత్యం'' గారికి, శ్రీ అక్కినేని వరుసగా నలభై రోజులు పని చెయ్యడానికి మార్చి యిరవై నుంచి అంగీకరించినట్లు తెలిసింది.

## అక్కినేనికి రెండు పాత్రలు

''నటసామ్రాట్'' వైవిధ్యం గల రెండు ప్రధాన పాత్రలను పోషిస్తున్న ఈ భారీ వర్ణ చిత్రానికి, శ్రీ తాతినేని రామారావు దర్శకుడు... కథా విధానకుడు

తమిళ రచయిత బాలమురుగన్ వ్రాసిన జనరంజకమయ్యే పటిష్టమైన కథకు ఆచార్య ఆత్రేయ మాటలకర్తగా, చలపతిరావు సంగీత కర్తగా పదవీభారాన్ని నిర్వహిస్తున్నారు.

ఈ చిత్రంలో యిద్దరు ప్రముఖులు నాయిక పాత్రలను పోషించగలరు.



'మంచిబాబాయ్'లో జయసుధ

### కేరళ దేశంలో ప్రభ వ్యాప్తి

తెలుగు నటి "ప్రభ"కు కేరళ చిత్ర రంగంలో ఎన్నో చిత్రాలు వస్తున్నాయి. ఆమె ఆ భాషలో నటించిన మొదటి చిత్రం "రౌడీ రాజమ్మ"ను ప్రేక్షకులు ... పత్రికలు బాగా గౌరవించాయి.

ఇప్పుడామె "నాదీ ఆడజన్మే...లక్ష్మణరేఖ" చిత్రాల మలయాళ ప్రతిలో నటిస్తున్నది.

ఒకవైపు తెలుగు చిత్రాలలో, మరోవంక తమిళ చిత్రాలలో బిజీగా వుంటున్న ప్రభ ఇప్పుడు మలయాళం రంగంలో కూడా వ్యాప్తి చెందడం, ఆంధ్ర సోదరులందరికీ గర్వకారణమేగదా!

"జానపద బ్రహ్మ" శ్రీ విఠలాచార్య రూపొందిస్తున్న "జగన్మోహిని" ప్రభకు ప్రకాశాన్ని యిచ్చే చిత్రం కాగలదు.



### జయమాలినికి స్వగృహం

శ్రీ విఠలాచార్య హస్తవాసి ప్రభావఫలితంగా జయమాలిని విశ్లీవేషాల రాణిగా చతుర్భాష చిత్రాలలో రాజ్యమేలుతున్న నిజం అందరికీ తెలుసు.

జ్యోతిలక్ష్మి ప్రశ్న ... విజయలలిత స్వయంకృత నిరాకరణ ... జయమాలినికి పటిష్టమైన స్థానానికి దోహదం చేసింది.

కష్టార్జితంతో జయమాలిని ఓ చక్కని "మేడ"ను చారీ వీధిలో నిర్మించుకుంది.

ఫిబ్రవరి 12న, ఆదివారం ఉదయం తొమ్మిదింటికి, జయమాలిని గృహాన్ని ఆస్తిగా పొందింది.

### జానపదాలకు పునర్జన్మ

1965 — 1970 ప్రాంతంలో తెలుగు సినిమా రంగం ఎక్కువగా జానపదాలను నిర్మించింది. మళ్లీ 1977–78లో జానపదాలకు గిరాకీ ఏర్పడింది.

ప్రస్తుతం అయిదారు జానపదాలు (వైవిధ్యం వున్నవి) నిర్మాణంలో వున్నాయి.

"జానపద బ్రహ్మ"గా వినుతి కెక్కిన శ్రీ విఠలాచార్య రూపొందిస్తున్న "జగన్మోహిని" ఏప్రిల్‌లో విడుదల అవుతుంది. నిర్మాత లక్ష్మయ్య చౌదరి... పి. ఎస్ రాజుగార్లు నిర్మిస్తున్న "రాజపుత్ర రహస్యం" స్కోప్ వర్ణచిత్రం అదే ప్రాంతంలో విడుదల అవుతూంది. (శ్రీ లాల్ దర్శకుడు; దశాబ్దం తరువాత శ్రీ ఎన్టీఆర్ జానపద నాయకుడుగా నటించడం గమనార్హం).

డాక్టర్ డి. వి. ఎస్. రాజుగారు నిర్మిస్తున్న "సింహబలుడు" స్కోప్ వర్ణచిత్రం శ్రీ రాఘవేంద్రరావు దర్శకత్వంలో జూన్ ప్రాంతంలో విడుదల అవుతుంది. [ఈ చిత్రంలో శ్రీ ఎన్టీఆర్... నాణీశ్రీ వెరైటీ పాత్రలను పోషించడం గమనించదగ్గ విషయం].

నటుడు శ్రీ గిరిబాబు ఏప్రిల్ 23న ప్రారంభించనున్న స్కోప్ వర్ణచిత్రం కూడా జానపదమే. ఇవిగాక, మరో నుగ్గురికి కాశీమజిలీ కథలపై మోజు ఏర్పడి, యీ సంవత్సరంలోనే జానపద చిత్ర నిర్మాణానికి పూనుకునే ప్రయత్నాలు కనిపిస్తున్నాయి

1977 – 78లో దాదాపు పది జానపద చిత్రాలను వీక్షించడానికి ప్రేక్షకులు సిద్ధపడాలి, మరి.

మనదొక విచిత్రమైన దారి. ఒకరు జానపదం అంటే... అలాంటివే మరో డజనుమంది తలపెట్టడం, ముఖ్యంగా మన రంగానికి ఆనవాయితీగా వుంటూవుంది.

ఈ జానపదాల పందెంలో ఎవరు నెగ్గుతారో? ఎవరు తగ్గుతారో?

### ప్రత్యగాత్మ చిత్రీకరణలో ఏ. ఏ. కంబైన్స్ చిత్రం

ఏ. ఏ. కంబైన్స్ అంటే "నటసామ్రాట్" శ్రీ నాగేశ్వరరావు సంస్థ అని, ఆయన్ను ఎరిగిన వాళ్లకు తెలుసు.

ప్రతి సంవత్సరం "మే" నెలలో శ్రీ అక్కినేని పని చెయ్యరని లక్షలాది ప్రేక్షకులకు తెలుసు.

ఎప్పటివలె, శ్రీ నాగేశ్వరరావు ఈసారికూడా అమెరికా వెళ్లగల అవకాశం లేకపోలేదు

ఏ. ఏ. కంబైన్స్ ఓ లఘుబడ్జెట్ చిత్రాన్ని తలపెట్టి, తమిళ రచయిత శ్రీ బాలమురుగన్ కథను ఓకే చేసింది.

ఆ కథకు సత్యానంద్‌ను మాటల రచయితగా, చలపతిరావును సంగీత దర్శకునిగా, సెల్వరాజ్‌ను ఛాయాగ్రహణ దర్శకుడుగా, జి. వి. సుబ్బారావును శిల్ప దర్శకుడుగా, నిర్మాత శ్రీ వెంకటరత్నం ఎంపిక చేయడం జరిగింది. "మే"లో షూటింగుకు వెళ్లనున్న ఏ. ఏ. కంబైన్స్‌లో మురళీమోహన్, ప్రభ, మాడా, దాశరథీ, కాకరాల ముఖ్య పాత్రధారులు.



'అన్నదమ్ముల సవాల్'లో జయమాలిని

# సినిమా

ఈ రంగుల చిత్రానికి కె. ఎస్. మణి, సత్యం, బాలు, భాస్కరరాజు ముఖ్య సాంకేతిక సారధులు. అన్నపూర్ణ విడుదల.

### అగ్రదర్శకుడి చిత్రంలో కొత్త కధానాయకుడు

''అగ్రదర్శకుడు'' శ్రీ దాసరి సినిమాస్కోప్ వర్ణ చిత్రంగా రూపొందించనున్న తారక ప్రభు ఫిలింస్‌లో ''స్వర్గం — నరకం'' చిత్రం ద్వారా పరిచితుడైన మేటి ''దుష్ట నటుడు'' శ్రీ మోహన్‌బాబును కధానాయకుడుగా, ''చిల్లరకొట్టు చిట్టెమ్మ'' చిత్రం ద్వారా యిమేజ్‌ను ఆర్జించుకున్న గోకిన రామారావును మరో ముఖ్య పాత్రధారిగా ఎంపిక చేసినట్టు, అధికారరీత్యా తెలిసింది.

ఏప్రిల్‌లో ప్రారంభమయ్యే యీ న్యూవేవ్ స్కోప్ వర్ణ చిత్రానికి కె. ఎస్. మణి, రమేష్ నాయుడు, భాస్కరరాజు, బసవయ్య ముఖ్య సాంకేతిక సారధులుగా పదవీ భారాన్ని నిర్వహిస్తున్నారు.

### దాసరికి అజ్మీ ప్రశంస

అగ్రదర్శకుడు శ్రీ దాసరి, ప్రముఖ చిత్ర నిర్మాత నాగిరెడ్డిగారి ''స్వర్గ్ ... నరక్'' హిందీ చిత్రానికి నిర్దేశకత్వం వహిస్తున్న నిజం పాఠకులకు తెలుసు.

ఇటీవల హిందీ సెట్టుకు వెళ్లాను. ఆరోజున నాయిక షబనఆజ్మీ నటించిన సన్నివేశాలను శ్రీ దాసరి చిత్రీకరించారు.

మన దర్శకుడి మొదటి హిందీ చిత్రం గదా, ఆయనపై ఆజ్మీ అభిప్రాయాన్ని సేకరించాను.

శ్రీ దాసరిని ఉత్తమశ్రేణి దర్శకుడుగా, సృజనాత్మక శక్తి వున్న నిర్దేశకుడుగా, సమయస్ఫూర్తి వున్న దర్శకుడుగా ఆవిడ తన అభినందనలను తెలిపింది.

మన దాసరికి హిందీ చిత్రాల డిమాండ్ తెలుగువలె వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి.

### పొట్టేలు పున్నమ్మ

విఖ్యాత చిత్ర నిర్మాత ''శాండో'' శ్రీ చిన్నప దేవర్ తమిళ... హిందీ చిత్ర రంగాలలో విజయ విహారం వొనరించిన విషయం ప్రేక్షకులకు తెలుసు.

ఇప్పుడాయన తెలుగు రంగాన్ని ప్రవేశించారు. తమిళంలో ''సిల్వర్ జూబ్లీ''ని చవిచూడనున్న ''ఆట్టుకావ అలమేలు'' చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నారు. చిత్రానికి ''పొట్టేలు పున్నమ్మ'' అని పేరు పెట్టారు.

''పున్నమ్మ''గా శ్రీప్రియ నటిస్తున్న యీ రంగుల చిత్రంలో మురళీమోహన్, రావు గోపాలరావు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, మోహన్‌బాబు, పద్మప్రియ, జయమాలిని ముఖ్య పాత్రధారులు.

శ్రీ త్యాగరాజన్ దర్శకత్వాన్ని, ఆచార్య ఆత్రేయ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, రామమూర్తి ఛాయను నిర్వహిస్తున్న ''పొట్టేలు పున్నమ్మ''ను లక్ష్మి ఫిలింస్ విడుదల చేస్తారని, శ్రీ త్రివిక్రమరావు తెలిపారు.

### తెలుగు "మొనగాడు"కు తమిళ వీరుని చేయూత

తెలుగులో ''మొనగాడు'' చిత్రాన్ని నిర్మించి విజయం సాధించిన విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మాత శ్రీ త్రివిక్రమరావుకు, తమిళ చిత్రాల విజయవీరుడు శ్రీ దేవర్ సహకారం లభించడం వల్లనే... ''పొట్టేలు పున్నమ్మ'' చిత్ర నిర్మాణం అనెడి నిజాన్ని, ''మొనగాడు'' తెలిపారు.

''శాండో'' శ్రీ చిన్నపదేవర్ యిచ్చిన మానసిక ప్రోత్సాహ ఫలితమే ''పొట్టేలు పున్నమ్మ'' పుట్టుక, అన్నారు త్రివిక్రమరావు.

శ్రీ దేవర్ ''అసాధారణ ప్రజ్ఞావంతుడు, మనసున్న మంచి మనిషి'' అన్నారు విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత.

### మల్టీ స్టార్స్‌తో త్రివిక్రమరావు చిత్రం

తెలుగులో మున్ముందు ''మల్టీ స్టార్స్'' చిత్రాలకు ఎక్కువ అవకాశం వున్నట్టు వివరిస్తూ, తన తరువాతి చిత్రంలో యిద్దరు అగ్రశ్రేణి నాయకులు పాల్గొనే కధను రూపొందించనున్నట్టు, విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మాత శ్రీ త్రివిక్రమరావు వెల్లడించారు.

కధను ఓ తమిళ రచయిత వ్రాసినట్టు, దానికి సంవిధానాన్ని సత్యానంద్ సమకూర్చినట్టు, సెప్టెంబర్ నుంచి చిత్రాన్ని ప్రారంభించనున్నట్టు శ్రీ త్రివిక్రమరావు తెలిపారు.

[33 వ పేజీ చూడండి]

'తుఫాన్ మెయిల్'లో మంజుల



### హిందీలో చిలిపికృష్ణుడు

సురేష్ ప్రొడక్షన్స్ నిర్మాత శ్రీ రామానాయుడు ''చిలిపికృష్ణుడు'' చిత్రాన్ని హిందీలో నిర్మించడానికి నిర్ణయించారు.

మార్చి రెండోవారంలో సురేష్ అధినేత బొంబాయి వెళ్లి, ''అక్కినేని ... వాణిశ్రీ'' పాత్రలకు అగ్రనటకుల్ని ఎంపిక చేస్తారని తెలిసింది.

తెలుగు చిత్రంలో కొన్ని లోపాలు వున్నాయని ఆయన అంగీకరిస్తూ, వాటిని హిందీ వెర్షన్‌లో సరిచేయడానికి శ్రీ నాయుడు నిర్ణయించారు.

''చిలిపికృష్ణుడు'' చిత్రం ''సోగ్గాడు'' వసూళ్లను అయిదు వారాలకే దాటినట్టు, శ్రీ నాయుడు తెలిపారు.

### శ్రీ లలితా మూవీస్‌కు దాసరి అంగీకారం

''ఇదెక్కడి న్యాయం'' చిత్రాన్ని నిర్మించిన శ్రీ జగదీష్‌చంద్రప్రసాద్, తన బ్యానరులో తలపెట్టిన రెండో చిత్రానికి, అగ్రదర్శకుడు శ్రీ దాసరి జూన్ చివరివారం నుంచి కాల్‌షీట్లు యిచ్చినట్టు తెలిసింది.

నవతా ఆర్ట్స్

# పంతులమ్మ

ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత: యన్. కృష్ణంరాజు

దర్శకత్వం: సింగీతం శ్రీనివాసరావు



# ☼ జి. వి. జి. పేజీ ☼

### కన్నబిడ్డా – కర్తవ్యమా ?

“నా స్నేహితుడికి ద్రోహం చెయ్యలేను,' అన్నాడు మధు కటువుగా. “పిచ్చి పిచ్చిగా మాట్లాడకు. మీ ముతావాళ్ళు ఎల్లకాలం మా కళ్ళు కప్పలేరు. నీలాగే రేపో మాపో మాకు దొరక్కపోరు. వాళ్ళ ఆచూకీ చెబితే నీకు కొంత శిక్ష తగ్గుతుంది. మధూ! చెప్పు వాళ్ళెక్కడుంటారు ?'' అని ఎస్. పి. ప్రశ్నిస్తూండగా టెలిఫోన్ బెల్ మోగింది. రిసీవర్‌లో రజని కంఠం “మీ ముందున్న మధు నా స్నేహితుడు... మీ టిన్లీ సన్ చిరంజీవి రవికుమార్ యిప్పుడు నా దగ్గరున్నాడు... షాక్ తిన్నారా ? కన్న బిడ్డా, కర్తవ్యమా ? గొప్ప చిక్కు ప్రశ్నే కదూ ? మధుని బయటకు వదలి పెట్టండి. లేదంటే — మీ అబ్బాయిని పైకి పంపేస్తాను'' అని వినిపించడంతోటే ఉగ్రుడైన ఎస్. పి. “యూ ఫూల్! ఇటువంటి బెదిరింపులకు లొంగేది ఈ ఎస్. పి. చౌదరి కాదురా ! ఒక్క కొడుకే కాదు; కుటుంబం మొత్తం సర్వనాశనమైనా సరే బాధ్యతలు మాత్రం వదలిపెట్టడు ఈ ఎస్. పి. చౌదరి,'' అనే పాత్రలో సత్యనారాయణ, ఆయన భార్యగా శుభ, మధుగా జయచంద్ర, అతని తండ్రిగా కొత్త తరహా పాత్రలో అల్లు రామలింగయ్య, పోలీస్ డిపార్ట్‌మెంట్‌ను గడగడలాడించిన గజదొంగలుగా రజనీకాంత్, కమలహాసన్, ఇతర పాత్రలలో సంగీత, శ్రీప్రియ, అపర్ణ నటించిన గీతా కంబైన్స్ “ఎత్తుకు పైఎత్తు'' చిత్రానికి అల్లు అరవింద్ నిర్మాత, పి. రవిరాజ్ దర్శకుడు, సత్యం సంగీత దర్శకుడు, లోక్‌సింగ్ ఛాయాగ్రాహకుడు.



'ఎత్తుకు పైఎత్తు'లో శుభ, సత్యనారాయణ

### 'మూవియోలా'లో అన్నదమ్ముల సవాల్

రాజలక్ష్మీవారి ఎడిటింగ్ రూమ్‌లో నిర్మాత పి. శశిభూషణ్, డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్ శ్రీ సారథి స్టూడియోస్ వర్ణ చిత్రం ఫైనల్ ఎడిటింగ్ పూర్తిచేసినవారల్లా “ఒక సీన్ చూస్తారా?'' అంటూ 'మూవియోలా' యంత్రాన్ని 'ఆన్' వేశారు... ఫిలిమ్ తిరగసాగింది... గుర్రాన్ని నడిపించుకుంటూ, దిగులుగా నడుస్తున్నాడు అశోక్. అంతలో మరో గుర్రంమీద అక్కడికి వచ్చిన కిశోర్ “ఇక్కడున్నావా మిస్టర్ ? నిన్ను వెతుక్కుంటూ వచ్చాను... ఆ రోజు నా కంటి వెలుగు నీ చేతిలో ఉంది. ఈ రోజు నీ ఇంటి వెలుగు నా చేతిలో ఉంది. నీ భార్య బ్రతికే ఉంది'' అన్నాడు. “ఆఁ! లక్ష్మి బ్రతికుందా ? ఎక్కడ ? ఎక్కడుందో చెప్పు!'' ఆత్రుతతో అడిగాడు అశోక్. “చెప్తాను. కాని, ఒక కండిషన్. నాకూ, జ్యోతికీ పెళ్లి చేసేయ్!'' అన్నాడు కిశోర్. అది అసంభవమన్నాడు అశోక్. “అయితే, నా జ్యోతికి దూరమై నేనెలా కుమిలిపోతున్నానో— నీ లక్ష్మికి దూరమై నువ్వూ అలాగే కుమిలిపో!'' అంటూ పోబోయిన కిశోర్‌ను వారిస్తూ, “బెదిరిస్తున్నావా ? నువ్వెంత పంతంపట్టినా సరే— నే బ్రతికుండగా నా చెల్లెలికీ నీకూ పెళ్లి చెయ్యను. చెప్పు. ఎక్కడ ? నా లక్ష్మి ఎక్కడ ?'' అంటూ హీరో మీదికి లంఘించాడు అశోక్. హోరాహోరీ పోరాటం. అశోక్‌ను పెద్ద రాయితో కొట్టబోయిన కిశోర్ జేబులోంచి ఒక ఫోటో కింద పడడంతో హఠాత్తుగా ఆ ఘర్షణ ఆగింది... మూవియోలా కూడా ఆగింది. ఛాయాగ్రాహకుడు ఎస్. ఎస్. లాల్ పనితనం అత్యద్భుతంగా ఉంది. కృష్ణ, రజనీకాంత్, త్యాగరాజు, చలం, అల్లు రామలింగయ్య, భీమరాజు, ప్రభాకర్, జయచిత్ర, చంద్రకళ, హలం, జయమాలిని, అంజలీదేవి పాల్గొన్న ఈ చిత్రం మార్చి 3న విడుదల. సత్యం సంగీత దర్శకుడు. నిర్మాతలు జి. డి. ప్రసాదరావు, పి. శశిభూషణ్. “మా తదుపరి చిత్రం యద్దనపూడి సులోచనారాణి నవల 'ఈ తరం కథ' ఏప్రిల్‌లో సెట్స్‌కి వెళ్తుంది'' అని తెలియజేశారు.

### తాడిగడప గ్రామంలో ఔట్‌డోర్ షూటింగ్

“యద్దనపూడి సులోచనారాణిగారి నవలకు అనుగుణంగా జనవరి 22 నుంచి 31 వరకు విజయవాడ దగ్గరున్న తాడిగడప గ్రామంలో కొన్ని ముఖ్యమైన సన్నివేశాలను చిత్రీకరించాం,'' అన్నారు అన్నపూర్ణా కళా నికేతన్ బేనర్‌లో “రాధాకృష్ణ'' వర్ణ చిత్రాన్ని నిర్మిస్తున్న దుక్కిపాటి మధుసూదనరావు. ఆయనతోపాటు మూల కథను డైరెక్టర్ కె. రాఘవేంద్రరావు, సంభాషణల కర్త సత్యానంద్ తెరకు అనువదించారు. శోభన్‌బాబు, చలం, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, మాడా, భానుప్రకాష్, జయప్రద, సూర్యకాంతం, రమాప్రభ, గిరిజ, నటవర్గం. కొసరాజు, దాశరథి, సి. నా. రె., వేటూరి గీతాలకు ఎస్. రాజేశ్వరరావు స్వరకల్పన చేశారు. విన్సెంట్ ఛాయాగ్రహణ దర్శకత్వం, కె. ఎస్. ప్రకాష్ చిత్రీకరణ, భాస్కరరాజు శిల్పం, ఎం. ఎస్. మణి కూర్పు గల ఈ చిత్రానికి కె.భానుప్రసాద్ ఎం.ఎ., బి.ఎల్., పి. గంగాధరరావు, బి.ఇ., సహనిర్మాతలు. ఎస్. ఎస్. రవిచంద్ర సహకార దర్శకుడు. మేలో విడుదల చేయాలని నిర్మాతలసంకల్పం.

### సంపూర్ణ హాస్యరసప్రధాన చిత్రం

“ముగ్గురు మూర్ఖరాళ్ళు'' మార్చి 15న సెట్స్‌కు వెళ్తున్నట్లు రచయిత, దర్శక నిర్మాత మహేష్ ఫిబ్రవరి 12న నాట్యతార జయమాలిని గృహప్రవేశ సుముహూర్తానికి విచ్చేసినప్పుడు నాకు వివరిస్తూ, అందులో స్లాప్‌స్టిక్ కామెడీ ఎలా వుంటుందో రెండు మూడు సన్నివేశాలు తెలియజేసి, కడుపుబ్బ నవ్వించారు. విజయలలిత, జయమాలిని, సూర్యకాంతం, రమాప్రభ, సరోజ, సుధ, మురళీమోహన్, సత్యనారాయణ, రాజ్‌బాబు పాత్రధారులు. చక్రవర్తి సంగీత దర్శకుడు. లావణ్య పిక్చర్స్ వారి ఈ చిత్రం షూటింగ్ ఏప్రిల్ 15 కి పూర్తవుతుంది.

### ఒక రచయిత నాటకంలో మరో రచయిత

గొల్లపూడి మారుతీరావు నాటిక “ప్రేమలో చైతన్యం''లో పినిసెట్టి, పినిసెట్టి నాటిక “ఆడది''లో గొల్లపూడి నటించడం ఒక విశేషం. మద్రాసులో ఫిబ్రవరి 11న ప్రదర్శింపబడిన ఈ నాటికలు బహుముఖ ప్రశంస అందుకున్నాయి. తరచు ఇలాంటి వినూత్నమైన, విశిష్టమైన కార్యక్రమాలను ఏర్పాటుచేసే “కళాసాగర్'' అధ్యక్షులు డాక్టర్ ముద్దుకృష్ణారెడ్డి, కార్యదర్శి శాస్త్రిగారు ఎంతైనా అభినందనీయులు.

స్వర్గసీమ లో శ్రీధర్,
ప్రభ, బేబిరాణి

**ఎన్ టి ఆర్. దర్శకత్వంలో చిత్రాలు**

''అక్బర్ – సలీమ్ – అనార్కలి'' మార్చి విడుదల. ఎన్. టి. ఆర్., బాలకృష్ణ, దీప ప్రధాన పాత్రధారులు. ''శ్రీరామ పట్టాభిషేకం'' చిత్రానికి ఇటీవల మువ్వలవానిపాలెం వద్ద చిత్రీకరించిన పతాక సన్నివేశాలలో శ్రీరాముడుగా–రావణబ్రహ్మగా ఎన్. టి. ఆర్., సీతగా సంగీత,

## జి. వి. జి. పేజీ

లక్ష్మణుడుగా రామకృష్ణ, మండోదరిగా జమున, కైకసిగా ఎస్. వరలక్ష్మి, కుంభకర్ణుడుగా త్యాగరాజు, హనుమంతుడుగా అర్జా జనార్ధనరావు, ఇంద్రజిత్తుగా చలపతిరావు, విభీషణుడుగా డాక్టర్ మారుతీ సుబ్బారావు పాల్గొన్నారు.

రామకృష్ణ సినీ స్టూడియోస్ పతాకంలో తయారయ్యే ''శ్రీ తిరుపతి వేంకటేశ్వర కళ్యాణం'' చిత్రానికి ఏలేశ్వరం సమీపాన పింజర కొండవద్ద ఎన్. టి. ఆర్. (విష్ణుమూర్తి, శ్రీనివాసుడు), బాలకృష్ణ (నారదుడు), జయప్రద (పద్మావతి), అంజలీదేవి (వకుళ) పాల్గొన్న కొన్ని సన్నివేశాలు చిత్రీకరించబడ్డాయి.



'నాలాగ ఎందరో'లో పల్లవి, రూప

## విధాత వ్రాసిన వింత కథ

కల్యాణ ఘడియలో వినిపించే కల్యాణ రాగంతో కలలు గన్న యువతి కళ్ళు విప్పేసరికి కనిపించే భర్త సాన్నిధ్యంలోని జీవితం నందనవనంగా ఊహించుకుంటుంది. అయితే, అది అంతులేని మధుర జీవనసారమా లేక కన్నీటి కడగండ్ల, వాసారమా అన్నది విధాత వ్రాసిన వింత కథ. ఈ కథలకు, గాథలకు ఆర్. కె. ఆర్ట్ ప్రొడక్షన్స్ ద్వితీయ చిత్రం ''నాలాగ ఎందరో''లో రూపకల్పన చేసినవారు – దర్శకుడు ఈరంకి శర్మ, నిర్మాత రంజిత్‌కుమార్, రచయిత గణేశ్‌పాత్రో, ఛాయాగ్రాహకుడు లోకనాథన్, సంగీత దర్శకుడు ఎం. ఎస్. విశ్వనాథన్, నటీనటులు భాను, రూప, పల్లవి, వాణి, సుజాత, జానకి, జయ, నారాయణ రావు, లక్ష్మీకాంత్, దాశరథి, పి. ఎల్. నారాయణ, హేమసుందర్, విక్రమ్, కోనేశ్వరశాస్త్రి, బొర్రా సుబ్రహ్మణ్యశాస్త్రి. హైదరాబాద్ శ్రీనగర్ కాలనీలో డిసెంబర్ 12 నుంచి ఫిబ్రవరి 10 వరకు దాదాపు 60 రోజుల షూటింగ్‌తో పూర్తయిన ఈ చిత్రంలో ఆత్రేయ గీతాలు ఆణిముత్యాలు.

## రెండు స్టూడియోలలో దొంగల దోపిడి

''200 ఏళ్లకు మునుపు జరిగిన కథా ఇతివృత్తంతో మేము టెక్నోవిషన్‌లో నిర్మిస్తున్న ''దొంగల దోపిడి'' వర్ణ చిత్రం హొగెనకల్ ఔట్‌డోర్ షూటింగ్‌తో మార్చి ఆఖరుకు పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాత యు. సూర్యనారాయణబాబు. ఇటీవల ప్రగతి, భాగ్యనగర్ స్టూడియోల్లో జరిగిన షూటింగుల్లో కృష్ణ, శ్రీధర్, మురళీమోహన్, త్యాగరాజు, గిరిబాబు, మోహన్‌బాబు, రాజ్‌బాబు, ఆదుర్తి నరసింహమూర్తి, కొంగర జగ్గారావు, కాంచన, శ్రీప్రియ, మరికొందరు జూనియర్ కళాకారులు పాల్గొన్నారు. ఆదుర్తి నరసింహమూర్తి రచన; శ్రీశ్రీ., సి. నా. రె., వేటూరి, జాలాది గీతాలు, సత్యం సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం గల శ్రీ పద్మావతీ పిక్చర్స్ పతాకంలో తయారయ్యే ఈ చిత్రానికి పి. మల్లికార్జునరావు దర్శకుడు. ★

# సినిమా విశేషాలు

[28 వ పేజీ తరువాయి]

## కోటారెడ్డి క్రొత్త ప్రయత్నం

''సంసారంలో సరిగమలు'' వంటి శతదినోత్సవ చిత్రానికి దర్శకత్వం వహించిన యం. యస్. కోటారెడ్డి క్రొత్త ప్రయత్నంగా ఒక ఒరియా చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు. బాబ్ అండ్ బాబ్ ఆర్ట్ పిక్చర్స్ సంస్థాధినేత శ్రీ దిడ్డి శ్రీహరిరావు ప్రముఖ దర్శకుడు శ్రీ దాసరి నారాయణరావు ప్రోత్సాహంతో లోగడ రెండు విజయవంతమైన చిత్రాలను నిర్మించిన సత్యం ప్రేక్షక విదితం. ప్రస్తుతం శ్రీహరిరావు ''మంచిమనసులు'' చిత్రాన్ని ఒరియాలో నిర్మించడానికి నిశ్చయించి, దర్శకత్వాన్ని కోటారెడ్డి కప్పగించారు.

## రామకృష్ణా ఆర్ట్సుకు కోటారెడ్డి

''వైకుంఠపాళి'', ''గడుసు పిల్లోడు'' చిత్రాలను నిర్మించిన రామకృష్ణారెడ్డి ఏప్రిల్ మాసంలో ప్రారంభిస్తున్న క్రొత్త చిత్రానికి కూడా కోటారెడ్డి దర్శకత్వం వహిస్తున్నారు. చంద్రమోహన్, ప్రభ హీరో, హీరోయిన్‌లుగా నటించే ఈ చిత్రానికి జంధ్యాల మాటల రచయితగా, చక్రవర్తి స్వరరచయితగా, భాస్కరరావు ఛాయాగ్రహణ దర్శకుడిగా పని చేస్తారు.

## మార్చిలో పదనిసలు

కోటారెడ్డి దర్శకత్వంలో ప్రేమ్స్ కంబైన్స్ నిర్మించిన ''ప్రయాణంలో పదనిసలు'' చిత్రం మార్చిలో విడుదలౌతుందని రూఢిగా తెలుస్తోంది. జీవితమనే రైలు ప్రయాణంలో ప్రతి మనిషి ఒక ప్యాసింజరు. ఈ ప్యాసింజరు గమ్యస్థానం చేరుకునేలోపు ఎన్నో ప్రమాదాలు, ప్రమోదాలు. ఒకానొక రైలు ప్రయాణంలో ప్రయాణం చేసిన కొంతమంది వ్యక్తుల సంతోషం, సమస్యల సమన్వయ రూపకమే ''ప్రయాణంలో పదనిసలు.'' యస్. బి. శంకర్రావు నిర్మించిన ఈ చిత్రానికి యస్. అన్నారావు నిర్వహణ.

## టీన్ ఏజర్స్ చిత్రం అమరప్రేమ

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ ఫిబ్రవరి రెండో వారంలో ప్రారంభించిన ''అమరప్రేమ'' వర్ణ చిత్రం, మార్చి చివరి వారానికి విడుదలకు సిద్ధమయ్యే విధంగా, నిర్మాత శ్రీ పూర్ణచంద్రరావు ప్లానింగ్ ప్రకారంగా పూర్తి అవుతుందని, ఆ చిత్ర దర్శకుడు శ్రీ తాతినేని రామారావు తెలిపారు.

యువతీ యువకులను విశేషంగా ఆకర్షించగల కథా సంవిధానంతో, మధురమైన రమణీయ శృంగార గీతికలతో అలరించగల ''అమరప్రేమ''కు కమలహాసన్... జరీనావహాబ్ పెద్ద యస్సెట్ అని చెప్పొచ్చు.

''టీన్ ఏజర్స్'' పదే పదే చూడదగిన 'అన్నీ' అమరప్రేమ చిత్రంలో వున్నాయి లక్ష్మీ ఫిలింస్ విడుదల.

—శ్రీనివాస్ ★



'దేవదాసు మళ్లీ పుట్టాడు'లో ఒక దృశ్యం

# ప్రశ్నావళి

సి బి కె — మద్రాసు

మా పక్కింటి అమ్మాయి మా ఇంటికి వచ్చి మాంచి నీతి మాటలు చెప్తుంది కాని ఒక అబ్బాయి నుంచి లౌ లెటర్ తీసుకొంది...

★ బాగుంది — లౌ నీతి కాదా ?! లేక నీతి మాటలు మాట్లాడేవాళ్ళు లౌ లెటర్ అందుకో కూడదా ?!

ఎస్ వి కె ఆర్. — హైదరాబాదు

ధైర్యానికి చిహ్నం గెలుపు ఔనా ?

★ కాదు గెలుపూ-ఓటమీ హీరోయిజానికి చిహ్నం కాదు, ప్రయత్నం చేయడం అన్నది వుందే — అదీ హీరోయిజానికి చిహ్నం

శంకర్ — నిజామాబాదు

భర్త దగ్గిర బానిసగా బ్రతికిన స్త్రీని పతివ్రత అని మీరు ఉపన్యాసాలు దంచేస్తున్నారు కాని ఆనాడు అగ్నిప్రవేశం చేసిన సీతతో పోల్చి చూస్తే మీ ఉపన్యాసాలిచ్చేవారి పాతివ్రత్యం ఏపాటిదంటారు ?

★ మీలాంటివాళ్ళు ఏపాటిదని ప్రశ్నించే హక్కు కూడ కోల్పోయారు - స్త్రీ పట్ల యిలాంటి చౌకబారు అభిప్రాయాలు పెంచుకుని ! పాతివ్రత్యం అంటే కాల్చుకుతినే భర్తల పాదాల చెంత పడివుండడం కాదు పిల్లలచేత కూడా ఛీ అనిపించుకోడం కాదు, మనిషిగా ఈ సంఘంలో చలామణి అవడానికి పాటుపడ్డమేనని గ్రహించండి, భారత స్త్రీకి సంసారం, వంటిల్లూ మినహాయించి— ఇతర వ్యాపకాలుండడం పాతివ్రత్య భంగం అనుకునే మీలాంటి ప్రబుద్ధులను చూస్తుంటే— జాలిపడాలో, బాధపడాలో తెలియడంలేదు

పి ఎస్, జి ఎస్, వి వి ఆర్ — బొంబాయి

సినిమాలు చూడడం మానేయడం ఎలా ?

★ ముఖంమొత్తేదాకా ముందు చూడాలి అప్పుడిక సినిమా జోలికి పోరు !

మన లోకంలో మంచిగా బ్రతికినా దూషిస్తారు చెడ్డగా బ్రతికినా దూషిస్తారు ఎలా బ్రతకాలి ?

★ అందుకే — మానవ జీవితంలో పడుగు పేకలలాగా మంచిచెడులు వుంటాయి అనడం పూర్తిగా 'మంచి' లేదు పూర్తిగా చెడూ లేదు - ఈ రెంటికీ నడుమ ఎక్కడో వుందాలి — జీవిత మార్గం అదే బ్రతకనేర్చిన మార్గం

ఎస్ ఎల్ జె. — కాకినాడ

నూరు అబద్ధాలాడేనా ఒక పెళ్లి చేయమంటారు పెద్దలు దీనికి మీరు ఏమంటారు?

★ శాశ్వత బంధాలయినా సరే, తాత్కాలిక స్నేహాలయినాసరే — 'అబద్ధం' పునాది మీద పెరగవు ! అంచేత అబద్ధాలు చెప్పి — పెళ్లి చేయకూడదు అబద్ధాలు చెప్పి స్నేహం చేయకూడదు

డి వి ఆర్ — విజయవాడ

తలెత్తి తిరిగే మా మగవారి ముందు మీరు తలొగ్గి వుండవలసిందే ఇది — సంప్రదాయం

★ అయివుండొచ్చు "టోపీని దాటి తలుంటే — అతనే మూర్ఖుడని గ్రహించు"మని ఆంగ్ల నానుడి ! అంచేత కాస్త తల దించండి !

ఎస్ పి టి సోమిదేవరపాలెం

మగవాళ్లను విమర్శించడం ఆడాళ్లను వెనకేసుకురావడం తప్ప మీకు వేరే పని లేదా ?

★ ఉంది మీరు చెప్పిన ఈ రెండు పనులకీ మధ్య నా ఊహలు చెప్పడమే ఆ పని ఆడదాన్ని పక్కకునెట్టి మగవాడు ఎంతోదూరం పోలేడనీ, ఆడదాని సహకారంలేని సంసారం — ఇలా కలంపై 'సుందర నరకమే' నని మగవాడు — పసివాడిలాగా అనుభవంమీద గ్రహించాలని చూడ్డం — కాలయాపనేననీ చెప్పాలని వుంటుంది నాకు.

కె వి ఆర్ కె — పాలకొల్లు

కె రా గారూ ఈ కాలం మగవారిపై మీ అభిప్రాయం సెలవిస్తారా ?

★ ఈ కాలం ఏమిటి ఏ కాలంలోనైనా మగవారి గుణం ఒక్కటే తమకి తోచదు, ఆడది చెప్తే — వినరు !

వి ఎమ్ ఆర్ — హైదరాబాదు

పొదుపు లాభం ఏమిటి ?

★ ఏంలేదు ! జులాయి తన వారసులని ఖర్చిపోతాడు ! పొదుపరి తనని తనే దోచుకుంటాడు !

బి వి ఆర్ — సీలేరు

పతితలను వివాహం చేసుకొనేవారిని ప్రోత్సాహమిచ్చి అభినందించాలేగాని, కించపరచడం సమంజసం కాదు

★ అదే నేను అన్నదీను అర్థం కాలేదా ?! "నేను కనుక పతితనైనా పెళ్లి చేసుకున్నాను" అంటూ జీవితాంతం సాధించేకంటే ఉన్నతికి ఎదగ లేని మనుషులు అలాంటి పెళ్లిళ్ళు చేసుకోకూడదు (మీరెక్కడా వినలేదా ? కట్నం తీసుకోనని గర్వంగా పెళ్లి చేసుకుని "నేను కనుక కట్నం లేకుండా పెళ్లాడాను" అని చెప్పే పెద్దమనుషుల గురించీ, 'అనాథ శరణాలయం స్థాపిస్తాం సహాయం చేయండి' అంటే 'నా పేర యిద్దరు అనాథలని యిస్తా'ననే బుద్ధిమంతుల గురించీ ! గొప్ప కోసం కొన్ని పనులు చేయకూడదు )

ఎం ఎస్ ఆర్ — ఒన్కుడిల్లి

ఎవరు ఎలాంటి ప్రశ్నలు వేసినా గొప్ప గమ్మత్తుగా సమాధానం యిస్తారు అందుకే మీకు ప్రశ్నలు వేయాలంటే అదోలా వుంటుంది ప్రశ్నలు వెయ్యమంటారా ? వద్దంటారా ?

★ సోదికెళ్లి తేల్చుకురండి—తొందరగా !

— కె. రామలక్ష్మి

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే యింధనాన్ని సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

రైలు మోస్తరుగానే మీకు కూడా ప్రతి రోజు ఉత్సాహంగా ప్రారంభించేందుకు ఇంధనం కావాలి. అందుచేతనే ప్రతి ఉదయం మీరు బూస్ట్ సేవించాలి.

మీరు చకచకా పనులు చేసుకోవడంలో మీకు తోడ్పడే శక్తిదాయకమైన ఇంధనం. ముఖ్యంగా పనిలోను, ఆటల్లోను అదనంగా శక్తిని వెచ్చించే మీ పిల్లలకు ఇది కావాలి.

వారికి బూస్ట్ ఇవ్వండి. ఈ మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' ఉత్పత్తిదారులు తయారు చేసింది.

అమూల్యమయిన క్రీమ్‌తో కూడిన బూస్ట్ మీకు మరింతగా శక్తినిస్తుంది. ఎందుచేతనంటే ఇది సంపూర్ణమయిన మీగడ పాలతోను, గోధుమతోను, బార్లీ మాల్ట్‌తోను, కోకోతోను తయారయింది.

బూస్ట్‌లో మీ పిల్లల పెరుగుదలకుగాను, ఇటువంటి మరే ఇతర చాకొలెట్ డ్రింకులోను లేనంత ఎక్కువగా పోషక పదార్థాలు ఉన్నాయి.

అంతేకాదు. బూస్ట్‌కి, మీ కుటుంబమంతా కూడా యిష్టపడే క్రీమ్ మాల్ట్ చాకొలెట్ రుచి, సువాసన ఉన్నాయి. బూస్ట్, మీ రోజుని ప్రారంభించేందుకు ఖచ్చితమైన మార్గం—ప్రతి రోజు.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుండి.

B 4575 TEL-1

# ఏ ము క్తి

(25 వ పేజీ తరువాయి)

జీనత్ తడబడిపోయి, ఏ సమాధానం చెప్పలేదేమో అనుకున్నాడు—షరీఫ్!

"ఆయామ్— మిసెస్ షరీఫ్— మే మిద్దరం భార్యా భర్తలం!" అంది జీనత్, ధైర్యంగా! ఇలాంటి సమాధానం వూహించని 'హెడ్' షాక్ తిన్నాడు!

"అందరూ భార్యా భర్తలనే అంటారు! రుజువేమిటి" అన్నాడు హెడ్‌కాన్‌స్టేబుల్, కాస్త కరుగ్గా, అధికార దర్పంతో

"ఇదిగో—నామెళ్ళో నల్లపూసలు— మేమిద్దరం మా నిఖా (పెళ్ళి) రోజు, ఖాజీగారి పుస్తకంలో పెట్టిన సంతకాలు! మీకు నా మాట నమ్మకం లేకపోతే మా పెళ్ళి జరిపించిన ఖాజీగారింటికి వెళదాం రండి!"—అంది, జీనత్, మరింత ధృఢంగా!

షరీఫ్‌కి ఏం చెప్పటానికి తోచక "హెడ్ గారూ—ఓ సారి అలా బయటి కొస్తారా?" అన్నాడు—ఎంతో నమ్రత వుట్టిపడేట్టు.

షరీఫ్‌తో పాటు హెడ్ బయటికి వడిచాడు! రెండు నిముషాల తరువాత షరీఫ్ ఒక్కడే రూమ్‌లోకి వచ్చాడు!

"హెడ్‌కాన్‌స్టేబుల్ వెళ్ళి పోయాడా?" అడిగింది జీనత్

"వెళ్ళిపోలేదు! మామూలు తీసుకొని, వెళ్ళాడు!" అన్నాడు షరీఫ్

"మామూలా! మామూలు దేనికి?"

"మేము భార్యాభర్తలం! ఇంకా పెళ్ళయి పదిరోజులన్నా కాలేదు! ఇంట్లో ప్రైవేట్‌గా లేక—యిక్కడ లాడ్జిలో కాస్త ప్రైవేట్‌గా వుందామని వచ్చాం!—అన్నాను—కాని—ఎంత చెప్పినా నిజం నమ్మడే! ఇక ఎలాగూ వదలడని ఓ వందపడేసి వదిలించుకున్నా!" అన్నాడు నిట్టూరుస్తూ.

"అయితే భార్యను పట్టుకొని—ప్రొటెక్ అని చెప్పారా?"

"చెప్పలా! వాడే మనిద్దరిని చూసి, అపోహ పడ్డాడు?"

"అపోహ!"

"కాకపోతే మరేమిటి! ఫ్యాన్సీడ్రెస్ కాంపిటీషన్‌లో—నా ప్రక్క ఆడవేషం వేసిన మగ వాణ్ణి చూసి, నువ్వు నా భార్య అనుకోంగా లేంది—ఎప్పుడు లాడ్జిల్లో ప్రొటెక్ కేసులు పట్టుకునే వాడికి, మనం అలా కనపడ్డంలో పెద్ద విడ్డూరమేముంది!" అన్నాడు, షరీఫ్ చురక అంటించినట్టు! జీనత్ ముఖంలో ఒకసారి రంగులు మారాయి!

"ఏమిటి—ఇది ఫ్యాన్సీడ్రెస్ కాంపిటీషను ఫొటోనా!? ఇతనెవరు—అచ్చం ఆడదానిలా వున్నాడు!? మీరు చెప్పేది?" అంది, నమ్మలేనట్టు.

"ఆ కవరులోనే— మాజంటకు— 'మొమెంటో' బహూకరిస్తున్న మా ఎయిర్ ఫోర్స్ ఛీఫ్—ద్వివేదివున్న ఫొటో కూడావుంది చూడు!" అన్నాడు షరీఫ్, వివరణ చెబుతూ! జీనత్, ఆఫొటో చూసి ముందు ఆశ్చర్యపడి భర్తను తొందరపడి అపార్థం చేసుకున్నందుకు సిగ్గుపడింది!

"దేవిగారు శాంతించినట్లేనా?" అన్నాడు షరీఫ్ నవ్వుతూ.

"అయినా యిదేం జోక్!"—ప్రసన్న వదనంతో, అంది జీనత్—ఇంకేం అనాలో తెలియక.

"జీనత్—ఏ విషయంలో నైనా—తొందర మంచిది కాదు! కంటితో చూసింది, అంతా నిజం కాకపోవచ్చు! జీవితాన్ని మరీ సీరియస్‌గా తీసుకోవటం, వల్ల—మంచి జరుగుతుందను కోవటం అపోహ! మధ్య మధ్య రిలీఫ్‌గా కాస్త జోకులూ వుండాలి! అందుకే పదకొండు సీరియస్ నెలల మధ్య ఒక ఏప్రిల్ నెల పెట్టారు! మూడువందల అరవైనాలుగు రోజుల ప్రక్కనే—'ఆల్ ఫూల్స్‌డే!' వుంచారు! అన్నట్టు ఇవ్వాళ 'ఏప్రిల్ ఫస్ట్' అనుకుంటాను అన్నాడు, నవ్వుతూ.

జీనత్‌కు అప్పటికిగాని అర్థంకాలేదు:— ఆరోజు ఏప్రిల్ ఫస్ట్ అని.

"ఈ ఏప్రిల్ ఫస్ట్‌న ఏడ్పించటానికా— ఇంత నాటకం ఆడారు?" అంది—తేరుకుంటూ.

"జీనత్ దారిలో — జంట ఫొటో దిగుదాం— గుర్తు చెయ్— బైదిబై ముప్పయి రూపాయలు అద్దె కట్టి— మూడు నిముషాల్లో వెళ్ళిపోయి— అక్కడ బంధి ఖానాలో మాత్రం ఏంతోస్తుంది! హ్యాపీగా —యిద్దరం— యిక్కడ ఓ చక్కటి విందు

చేసుకుందామా ?''— అడిగాడు— షరీఫ్ ఉత్సాహంగా !

''ఇక్కడ లాడ్జిలోనా ! అమ్మ-నాన్న- మనకోసం ఇంటిదగ్గర-బిర్యానీ సిద్ధంచేసి- ఎదురు చూస్తుంటారు !'' అంది, సంతోషయిస్తూనే-జీనత్ !

అక్కడినుంచి ఎంత తొందరగా బయట పడితే అంత హాయిగా వుంటుంది— అన్నట్లుంది—జీనత్ ధోరణి.

''ప్లీజ్ ! మనం, పెళ్ళయి స్వేచ్ఛగా వచ్చిన చోటు ! ఇక్కడున్న స్వేచ్ఛ అక్కడ మనకుంటుందా ! ఎలాగూ వచ్చాంగా ! ఇలా మధురంగా గడిపిన యీ కొన్ని క్షణాలే జీనత్— మనకు మధురంగా జీవితాంతం నిలిచేది ! అంటూ బయటికెళ్ళి, డిన్నర్‌కి ఆర్డరిచ్చి వచ్చాడు షరీఫ్ ! జీనత్ భర్త మాట కాదనలేక పోయింది.

''జీనత్ ! ఇన్నాళ్ళూ నాకు బాధ్యతలు లేవు కాబట్టి— మా అమ్మా నాన్న లేకపోవటం వల్లనూ అన్నయ్య రఫీకి— నా తదనంతరం నా ఉద్యోగరీత్యా లభించే-ఇన్సూరెన్స్ —ప్రావిడెంట్ ఫండ్...

''ఏమిటండీ ! డిన్నరు హాయిగా తిందామని చెప్పి—ఇవి చెబుతున్నారు !'' మధ్యలోనే షరీఫ్ మాటలు ఆపేస్తూ అడిగింది, జీనత్ !

''కీడెంచి మేలెంచటం మంచిది జీనత్!

''కీడూ వద్దు— మేలూ వద్దు ! మీ తదనంతరం— అన్న విషయం నేను కలలో కూడా ఊహించలేంది ! ప్లీజ్ ఆ విషయాలు యిప్పుడు దయచేసి ఎత్తకండి !'' అంది జీనత్, ఆ సంభాషణ యిష్టంలేక !

కాని, షరీఫ్ మళ్ళీ అదే విషయం ప్రస్తావిస్తూ—

''నేను ఉద్యోగంలో చేరినప్పటి నుంచి నెలకో అయిదొందలు మా వదిన పేర మనియార్డరు పంపుతున్నాను.''

''అది అలాగే పంపండి ! దాంట్లో ఏ మార్పులూ వద్దు !

''మరి నీ ఖర్చులకి !?''

''నేను మీ యింట్లో—మీ వదినతోపాటే వుంటాగా ! ఇంకా నాకు, వేరే ఖర్చులకు, డబ్బు దేనికి ?''

''ఏమిటీ ! నువ్వు—నేను లేకుండా— మా వదినతోబాటు ఉండగలవా ?

''చెయ్యి చెయ్యి కలిస్తేనేగా చప్పుడయ్యేది ! మా ఆడవాళ్ళం— ఎలాంటి పరిస్థితులకయినా యీజీగా యడ్జెస్టయిపోతాం ! మీ వదిన కొంచెం కోపిష్టి ! ఏదన్నా ఆమె కాస్త తొందరపడ్డా— ఆమె నా కంటే పెద్దది ! నా పెళ్ళికి మా నాన్న తలమునిగే అప్పులు చేసివుండాలి ! ఇంకా మా చెల్లెలు నస్రీన్-తమ్ముడు సత్తార్ ఆయనకు బరువు వుండనే వున్నారు. అందుకని నేను మీ యింట్లోనే వుంటాను !'' అంది తన మనసులో విషయం చెప్పేస్తూ.

''అయితే నేను వెళ్ళగనే మంచి ఫ్యామిలీ క్వార్టర్స్ కోసం గట్టి ట్రయల్ వెయ్యాలి ! ఉద్యోగం దొరకడమే తేలికేమో గాని—ఫ్యామిలీ క్వార్టర్సు దొరకటం మాత్రం అసంభవం!' అంటుండే వాళ్ళు మేరేజ్ అయిన— మా కొలీగ్స్ ! ఇప్పుడు— వాళ్ళ మాటల్లో ఎంత నిజముందో నాకు ఇక అనుభవ మౌతుంది!'' అన్నాడు షరీఫ్, నవ్వుతూ.

అప్పుడే ఇద్దరు రూమ్ బాయస్—రెండు పెద్ద ట్రేలలో వివిధ పదార్థాలు పింగాణీ ప్లేట్లు— స్పూనులు— చిన్నచిన్న గిన్నెలు, దొంతర్లుగా తెచ్చి—టేబుల్ మీద పేర్చారు

''డ్రింక్ తెమ్మని చెప్పాగా—తేలేదా?''— అడిగాడు షరీఫ్.

''ఇప్పుడే తెస్తాం సార్! జస్ట్‌వాన్ మినిట్!'' అంటూ, ఆ యిద్దరు రూమ్ బాయస్ వెళ్ళి పోయారు.

జీనత్ అదిరి పడింది—'డ్రింక్'—అని, చెప్పలపడగానే!

''నాముందే యీయన తప్పతాగి—ఇంటికొస్తాడా! తాగిన వాళ్ళు సరిగా వుండరు— ఏమేమో మాట్లాడ తారు—ఎట్లాగెట్లాగో ప్రవర్తిస్తారు —పైగా నాకు తాగిన వాళ్ళంటే భయం!'' అనుకున్నది.

''డ్రింక్ మెల్లిగా వస్తుంది! ముందు యీ చిప్స్‌తో పార్టీ ప్రారంభిద్దాం! లేడీస్! ఫస్ట్— ప్లీజ్'' అన్నాడు, షరీఫ్.

''డ్రింక్ ఏదో ఆర్డరిచ్చా నన్నారు?అది వొచ్చేదాక ఆగరా!?''

''ఓ! సారి నీసంగతే మర్చేపోయాను! నీ ఫేవరిట్ డ్రింక్ ఏమిటి?''—అడిగాడు— షరీఫ్.

''మీ దయవల్ల యికనేర్చుకోవాలి! ఇంతవరకు అలవాటు లేదు!''—కోపాన్ని దిగమింగుతూ—లేని నవ్వుతో అంది, జీనత్!

''ఇంత వరకు డ్రింకే అలవాటు కాలేదా వాటె కంట్రీ గర్ల్!''—అన్నాడు—తీసి పారేసినట్లు

''స్వామీ— మీరు ఆకాశంలో ఎగిరే పైలట్! మీరే డ్రింక్ తాగినా ఏం చేసినా— మిమ్మల్నెవరూ తప్పు పట్టరు! ముస్లిం గరల్‌నై—చదువుకోడానికి 'ఘోషా' లేకుండా కాలేజీకి వెళ్ళానని—మా కుటుంబాన్ని వెలివేశారు! ఎన్. సి. సి.లో చేరి—ఆయూనిఫాంలో యింటి కొస్తుంటే—'ఇది మగరాయుడు—దీనికొచ్చే మొగుడు మూడోరోజే చస్తాడు అంటూ మావాళ్ళే శాపనార్థాలు పెట్టారు! ఇక డ్రింక్ తాగటం—అలవాటు చేసుకోవడం కూడానా?''— అంది జీనత్ !

''నో నో! జీనత్— ఎక్కడున్నప్పుడు అక్కడి కంపెనీ కోసం—మనకు అలవాటు



లేక పోయినా—కొన్ని కొత్త అలవాట్లు చేసు కోవాలి! 'బి ఎ రోమన్ వైల్ యు ఆర్ యిన్ రోమ్'—అంది ఎందుకు?''

''ఆవండి! నేను ఎంత వీరా భార్య నాయినా—నాలుగు ముక్కలు చదువు కోడా నికి, ఘోషా లేకుండా తిరిగినా—నేను స్త్రీని నా హద్దు లేమిటో నాకు తెలుసు! ఇలాంటి పనులు నేను చేయలేను! ప్లీజ్—నన్ను ఫోర్స్ చేయకండి!'' అంది, కోపాన్నిదిగమింగుతూ.

ఇంతలో, రూమ్ బాయ్—ఒక ప్లేటులో పెట్టి తెచ్చిన డ్రింక్స్ చూసిన జీనత్—ఈ డ్రింక్సా! ? !? వీరు యిందాకటి నుంచి చెబుతున్నది!? ''అంది ముఖం చిన్న బుచ్చు కుంటూ, సిగ్గుతో

''తొందరపడి వెంటనే ఒక నిర్ణయానికి రాకూడదన్నానా? అందుకే 'ఏప్రిల్ ఫస్ట్' అని. యిందాకే గుర్తు చేశాను! అన్నాడు షరీఫ్.

''ఈయన భలే వారే—ఏమిటి నన్ను యిన్ని టెస్టులు చేసి—ఆటలు పట్టిస్తు న్నాడు! నేనే యీయన్ని తొందరపడి ప్రతి సారీ అపార్థం చేసుకుంటున్నాను!'' అను కుంటూ జీనత్ బాధపడింది.

ఇద్దరూ పిచ్చాపాటి మాట్లాడుకుంటూ భోజనం ముగించారు. ''జీనత్! ఇక్కడ ఓ ఫోటో స్టుడియోలో— ఇన్‌స్టాంట్ కలర్ ఫోటో తీసే కెమేరా వుంది! ఒక ఫోటో దిగుదాం! కమాన్'' అంటూ బయలు దేర తీశాడు, షరీఫ్.

''నడిచే వెళదామా?'' భయపడు తున్నట్టు ముఖం పెట్టి అడిగింది, ఆగి పోయిన జీనత్.

''ఎప్పుడూ మబ్బుల్లో తిరిగి తిరిగి—మనుషుల మధ్య తిరుగు తుంటే అథోగతిల్ నువ్వు మాత్రం 'ఘోషా—ఘోషా' అంటూ ఇంట్లో కూర్చున్న దాని వేగ! మనిషిరోడ్డు మీద పడితేగాని కాస్త లోక జ్ఞానం రాదు! కమాన్! కమాన్!'' అన్నాడు తను ముందు నడుస్తూ.

''ఇదే ఫోటో స్టూడియో! కమాన్''—అని షరీఫ్ పిలిచే వరకు తను మళ్లీ వర్తమానంలోకి రాలేకపోయింది జీనత్.

''ఎప్పుడో చిన్నపిల్లగా వున్నప్పుడు—తిరిగిన రోడ్లు ఎంత మారిపోయాయి! ఇది నేను పుట్టి పెరిగిన వూరేనా!? ఇంత తక్కువ కాలంలో ఎంత మార్పు చెందింది.

# వి ము - క్తి

ఏమిటో అంతా కొత్తగా వింతగా వుంది. పదేళ్ళ జైలుశిక్ష తరువాత, కొత్తగా బయటికి వచ్చిన ఖైదీకి తనకు ఏం భేదం వుంది!'' అనిపించింది జీనత్‌కు.

పదిరోజులకు ముందు— ఆయనెవరో—తనెవరో కాని విచిత్రంగా వివాహం జరిగి పోయింది! బహుశా పెళ్ళికి ముందు పెళ్లి కొడుకుతో యింటర్‌వ్యూ జరిపిన, తొలి ముస్లిం పెళ్లికూతురు తనేనేమో! తనకు ఎంత భయమేసింది— ఆయన ఏ మే మి ప్రశ్నలు వేస్తాడోనని! కాని తనూ ధైర్యం చేసింది! ఆ యింటర్‌వ్యూ జరగకుండా వుంటే తనకు పెళ్లి అయి వుండేది కాదు.

జీనత్‌కు, తన పెళ్ళికి ముందు తను షరీఫ్‌తో మాట్లాడ్టం పెళ్లికి దారి తీసిన సంఘటనలు — పెళ్లి— ఒ క్క సా రి గుర్తొచ్చాయి!

*　　*　　*

ఓ రెండు నెలలు, లాంగ్‌లీవ్‌లో వచ్చిన షరీఫ్‌కు, ఆపేటలో ఆప్త మిత్రుడు రవూఫ్, ఒక్కడే! ఇద్దరికీ వయసులో ఏడెనిమిదేళ్ళ ఎడమున్నా ఇద్దరూ చిన్నప్పుడు ఒకే స్కూల్లో కొన్నేళ్ళు కలసి చదువుకున్నారు.

రవూఫ్ తన కష్టసుఖాలు అరమరికలు లేకుండా, మనసు విప్పి కుంటాడు! ఇద్దరు మిత్రులు గంటలు గంటలు పార్కులో కూర్చుని కబుర్లు చెప్పకుంటారు.

రవూఫ్ సబ్‌పోస్టాఫీసులో పోస్టుమేష్టరని తను డిఫెన్స్ ఫోర్సులో పైలట్ అనే అరమరికలు వాళ్ళిద్దరి మధ్యా లేవు.

''బ్రహ్మచారి ముదిరినా బెండకాయ ముదిరినా పనికి రావంటారు నీ పెళ్ళికి పలావు తినే యోగం వుందా లేదా?'' అనే వాడు రవూఫ్ షరీఫ్‌ని ఎగతాళి చేస్తూ.

''నేను ఎయిర్ ఫోర్సులో పైలట్‌నని తెలిసీ నాకు పిల్లనిచ్చే దేవడు అపలేరిస్కీ లైఫ్ అంటూ మెల్లిగా ఆ సంభాషణ తప్పించుకునే వాడు షరీఫ్.

ఆ సారి రెండేళ్ళ తరువాత సెలవల్లో వచ్చాడు షరీఫ్. ఎప్పుడొచ్చినా, అతను వుండేది వాళ్ళన్నయ్య రఫీయింట్లోనే రఫీ ఓ పెద్ద స్టోర్ల కంపెనీలో చిన్న గుమస్తా. కుటుంబ నియంత్రణ యింకా ప్రచారంలోకి రాకమునుపే, పదిమంది పిల్లలకు తండ్రయి ఆ నియంత్రణ కఠినంగా అమలు పరచక పోతే ఎంత అనర్థమో, ప్రాక్టికల్‌గా ఆ పేటలో చాలా మంది సంసారులకు కనువిప్పు కలిగించాడు.

''నాకు మాత్రం ఎవరున్నారు అన్నయ్య కుటుంబం పెద్దది. కాస్తనాడిని ఆదుకోక పోతే ఎలా?'' అనుకున్న షరీఫ్, ప్రతినెలా నాలుగయిదొందలు వదిన పేర ఎమ్. ఓ పంపేవాడు అందుకని షరీఫ్‌ని—అన్నరఫీ, వదిన ఖాతూన్‌బీబి, ప్రాణప్రదంగా చూచు కొనేవారు రఫీ మెతక మనిషి దాంతో ఖాతూన్‌బీబి వి జృం భిం చి ''మ న యిద్దరమ్మాయిలు పెళ్ళీ డు కొచ్చి కూర్చుంటున్నారు! వీతమ్ముడి జీతమంతా బ్యాంకులో మూల్గుతూ పడివుంటమేగా! పిల్ల పెళ్ళిళ్ళు చేసుకుంటాం—కాస్త డబ్బు సర్దమని అడగండి!'' అం టూ భర్త ప్రాణాలుతోడేది ఖాతూన్ బీబి.

''నెలనెల నాలుగయిదొందలు పంపు తూనే వున్నాడుగా! ఇంకా వాణ్ణి డబ్బులడ గటం ఏం బావుంటుంది!'' అని రఫీఅంటే

## ప గ లు – రా త్రి

నగ్నంగా
నిలబడుతుంది పగలు
తన కొండల్నీ లోయల్నీ
స్పష్టంగా చూపిస్తూ
రోదసి రేఖల వంపులన్నీ
కళ్ళ ముందు కదిలిస్తూ—
చుక్కల చీర కట్టి
చీకటి నాటుక పెట్టి
జాబిల్లి నవ్వుతో
స్పష్టాస్పష్టంగావాలుతుంది రాత్రి,
మనస్సు మెలకువ రెప్పగొట్టి
లోకంలోకి దించుతుంది
పగలు
మన సౌందర్యాన్ని చిచ్చికొట్టి
ఆత్మలోకి పెంచుతుంది
రాత్రి
పగలు దాటిన-తర్వాత నన్ను
　　　　లాగుతుంది
మహాంధకార తీరం!
రాత్రి చివర నా కోసం
　　　　వేచి ఉంటుంది
సువర్ణకాంతి సౌధ శిఖరం!
—అద్దేపల్లి రామమోహనరావు.

# ఉచితం




# కీ డిటర్జెంట్

# బిజ్ తోమే పౌడర్‌తో




| కొనే ప్రతీ బిజ్ ప్యాక్ బరువు | ఉచితంగా లభించే కీ ప్యాక్ బరువు |
|---|---|
| 500 గ్రా. | 50 గ్రా. |
| 600 గ్రా. | 50 గ్రా. |
| 1.2 కి.గ్రా. | 50 గ్రా. |
| 3.0 కి.గ్రా. | 100 గ్రా. |

త్వరపడండి!
సరుకు
ఉన్నంతవరకే
ఈ కానుక

గోద్రెజ్ ఉత్పాదన

# బిజ్ చక్కటి పొదుపు కోసం

CASGS-117-344 TL

# వి ము క్తి

"వీూ పిచ్చి బంగారం గానూ! వీూ తమ్ముడికి పెళ్ళికానంత వరకే నండి మన భాగోతం సాగేది! ఆ మహాతల్లి ఎవత్తైనా వచ్చిందంటే, మన నోట్లో కరక్కాయే! అందుకే, ఎవర్తైనా వీూతమ్ముడి పెళ్ళి ప్రస్తావన తెస్తే 'చూస్తూ విమానాలు నడిపేవాడికి పిల్లనిచ్చి ఏ తల్లితండ్రులు ఆ పిల్ల గొంతు కోస్తారు! ఏమో నమ్మా! వింత నా మరిదైనా—పెళ్ళి ప్రసక్తి తెవటానికి నాకే భయమేస్తుంది' —అంటూ నెట్టుకొస్తున్నా! పోనీ మన చిన్నవ్వాసు ఇస్మాయిల్‌ని దత్తత్వా చేసుకోనునండి!'' అంటూ చెబుతుండేది, ఖాతూన్ బీబి

భర్తకు చెప్పాల్సినవి చెప్పి ఆడపిల్లల్ని వదిలేది కాదు

"ఒసేవ్ పిచ్చిముద్దులా! చిన్నాన్న వూరినుంచి వచ్చాడు. 'మాకు కొత్త బట్టలు కావాలి—కొత్త చెప్పులు కావాలి — జిగినీ గొలుసు కావాలి' అని అడిగి చావండే! అన్నీ ఆయనే యిప్పిస్తాడు! అని తన కూతుళ్లకు నూరిపోసేది, ఖాతూన్‌బీబి — తల్లి చెప్పినవన్నీ గుర్తు పెట్టుకొని, ఆ పిల్లలు షరీఫ్ దుంపతెంచి, అవన్నీకొనిపించే వాళ్లు!

## కార్టూన్‌లు పంపేవారికి మనవి

కార్టూన్‌లతో పాటు స్వంత చిరునామాగల స్టాంపులు అతికించిన కవరుపెట్టి సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం విజయవాడ 3. అన్న చిరునామాకి టపాలో పంపాలి వీటి పరిశీలనకు కనీసం 6నుంచి 8 వారాలు పట్టవచ్చును. ఈలోగా, నేరుగా కాని, టపాలోగాని వీటిపై ఉత్తరప్రత్యుత్తరాలకు తావు ఉండదు. కార్టూన్‌లు 'టపా'లో పోయినా, దారితప్పిపోయినా సంపాదకుని బాధ్యత వుండదు. ప్రత్యేక సంచికలకు కార్టూన్‌లు పంపేవారు కవరు మీద ఆ సంచికపేరు ఉదహరించాలి. ఈ కార్టూన్‌లకికూడా పై నిబంధనలు వర్తిస్తాయి.

సం.

ఓ రోజు షరీఫ్ ఏదో పేపరు చదువుతూ ఈజీ ఛెయిర్‌లో పడుకొని వున్నాడు.

ఇంతలో "అంకుల్!" అన్న గొంతు విని, తల ఎత్తి చూశాడు ఆ వచ్చిన వాడు సత్తార్. అతని ముఖం భయంతో ఎఱ్ఱబడి వుంది.

"అంకుల్! మా నాన్న పోస్టాఫీసుకు వెళ్ళబోతూ, గుండెనొప్పి వచ్చి పడిపోయాడు. అమ్మ మీకు చెప్పిరమ్మంది" అన్నాడు కంగారుగా.

షరీఫ్ వెంటనే కుర్చీలోంచి ఆశ్చర్యంగా లేస్తూ ఏమిటీ? గుండెనొప్పి వచ్చి పడిపోయాడా! నేను డాక్టరుని పిలుచుకొస్తాను! నువ్వు పద!" అంటూ బయటికి పరిగెత్తాడు.

ఓ పావుగంటలో డాక్టరుతో ఆటో దిగి రవూఫ్ యింట్లోకి అడుగు పెడుతూనే "వేడినీళ్ళు సిద్ధం చేయండి!" అన్నాడు, లోపల ఘోషాలో వున్న రవూఫ్ భార్య ఫాతిమాకు వినబడేట్టు.

స్టెతస్కోప్‌తో పరీక్షించటం అవగానే, "హియీజ్ లక్కీ! ఇటీజ్ ఎ వెరీ లైట్ ఎటాక్!" అన్నాడు ఆ వచ్చిన డాక్టర్.

ఆ డాక్టర్‌ను సాగనంపడానికి బయటికి వచ్చిన షరీఫ్‌తో "మిస్టర్ షరీఫ్! మీ ఫ్రెండ్‌కి వచ్చింది కాస్త సీరియస్ హార్ట్ ఎటాకే! అతనికి మనం మాట్లాడుకుంటున్న విషయాలు వినబడుతున్నాయ్! హైగా–బ్లడ్‌ప్రెషరూ వుంది! అందుకని అతన్ని కంగారుపెట్టకూడదని అలా చెప్పాను! ఇదీ ఓ రకంగా హార్ట్ అటాక్ ట్రీట్‌మెంట్! అసలు విషయం— ఆయన భార్యకు రహస్యంగా చెప్పండి. అన్నాడు. యింకో మందుల లిస్టు వ్రాస్తూ, షరీఫ్ ఆ మాటలు వింటూనే— ఆ హార్ట్ ఎటాక్ తనకు వచ్చినట్టు ఫీలయ్యాడు.

తన మిత్రుడు తనకు అండగా నిలచి తన ప్రాణం కాపాడాడని రవూఫ్ "నువ్వు వాడివైనా— నీకు— నేనూ, నా కుటుంబం, చేతులెత్తి మొక్కాలి నీ రుణం ఎలా తీర్చుకోగలను?" అన్నాడు, గొంతు గద్గదిక మవుతుండగా.

"ఇందులో నేను చేసిందేముంది! నువ్వు కాస్త రెస్టు ఎక్కువగా తీసుకోవాలి! దిగులు చింతా కలిగించే విషయాలు, మనసుకు కాస్త దూరంగా వుంచుకోమన్నాడు డాక్టర్" సలహాలా చెప్పాడు షరీఫ్.

ఓ వేదాంతిలా నవ్వాడు రవూఫ్.

"ఏ తప్పు చెయ్యని నిరపరాధికి—ఏ ముద్దూ ముచ్చటా తీరకుండానే జీవచ్ఛవంలా బ్రతకమని శాపించిన యీ మనుషుల మధ్య ఏ దిగులూ చింతా లేకుండా జీవించటం సాధ్యమా షరీఫ్!" అన్నాడు రవూఫ్.

షరీఫ్‌కు తన మిత్రుడు ఎవరిని గురించి చెబుతున్నాడో అర్థం కాలేదు.

"ఏమిటి నువ్వు చెప్పేది? ఎవరిని గురించి?" అన్నాడు, ఆశ్చర్యంగా!

"మా పెద్దమ్మాయి జీనత్‌ని గురించి!"

"మీ పెద్దమ్మాయి జీనత్‌ను గురించా? ఆ అమ్మాయి...!?"

"వ్యక్తురాలై— ఘోషా లేకుండా—కో ఎడ్యుకేషన్ వున్న ఒక జూనియర్ కాలేజీలో రెండేళ్ళు చదువుకుంది! అదే అది చేసిన పాపం! టెన్త్‌లో స్టేట్ ఫస్ట్ వచ్చింది! ఆ ఉత్సాహంతో యింటర్ కూడా చదువుతానంది! దానికి చదువు చెప్పిన టీచర్లంతా— అంత తెలివిగల పిల్లను చదువు మాని పిస్తారా! చదివించండి మంచి స్కాలర్‌షిప్ వస్తుంది'—అంటూ ప్రోత్సహించారు! దీనికి తోడు అది ఎన్. సి. సి.లో చేరి 'సి' సర్టిఫికెట్ సంపాదించి అండర్ ఆఫీసరూ అయ్యింది! అదే—అది చేసిన పాపం! చదువు కాని తల్లిదండ్రులకు లోకజ్ఞానం లేక' చదువుకున్న పిల్ల మాకొద్దు చదువుకోని అమ్మాయే మా కోడలు కావాలి!' అంటుంటే దానికి కొంత అర్థముంది! కాని, బాగా చదువుకున్న మగపిల్లలు కూడా— ఘోషా లేకుండా తిరిగి, చదువుకున్న పిల్లని మేము చేసుకోము అంటూ నా ముఖానే చెప్పారు!.

జీనత్ వ్యక్తురాలై ఏనిమిదేళ్ళయింది. మన ప్రాంతాల వాళ్ళు ఎవరూ పెళ్ళి సంబంధం కావాలన లేదు! ఎవరైనా దూర ప్రాంతాల వాళ్ళు తెలియక వస్తే "అది ఘోషా లేకుండా మగపిల్లల కాలేజీలో చదువుకున్న పిల్ల పైగా యిన్‌స్పెక్టరులా ఖాకీ డ్రెస్సుల్లో తిరిగిన మగరాయుడు! అది మొగుడితో కాపురం చేస్తుందా! దాన్ని కోడలుగా తెచ్చుకోవటం కొరివితో తల గోక్కోవటం రెండూ ఒక్కటే" అంటూ మన వాళ్ళే వాళ్ళను భయపెడుతూ వచ్చిన వాళ్ళను వెళ్ళగొడుతున్నారు.

జీనత్‌కు యింకా ఇప్పటికి పెళ్ళి కాదు! దానితో పాటు రెండో అమ్మాయి నస్రీన్‌కి! రేపు నేను చస్తే నన్ను మన గోరీల్లో మన వాళ్ళే పూడ్చనివ్వరు!" అన్నాడు చిన్నపిల్లవాడిలా వలవల ఏడుస్తూ రవూఫ్; షరీఫ్‌కి మిత్రుడు రవూఫ్ తన కూతురికి ఏవో సంబంధాలు వెతుకుతున్నట్టు తెలుసు కాని, ఆ అమ్మాయి పెళ్ళి యింత ప్రాణాంతక సమస్య అయికూర్చుందని తెలియదు.

(ఇంకా ఉంది)









# ఆంధ్రసచిత్రవారపత్రిక

## ఈనాటి వనితాలోకం

### కొత్త ప్రత్యేక శీర్షిక

అన్ని రంగాలలోను తమ ప్రతిపత్తిని నిలుపుకుంటున్న ఈనాటి మహిళాలోకం పోకడలను అద్దంపట్టే వ్యాసాలను వారం వారం సచిత్ర వారపత్రికలో వెయ్యాలనుకుంటున్నాము. ఈ శీర్షిక క్రింద ప్రచురితమైన ప్రతి రచనకి రూ. 30 లు పారితోషికం యిస్తాము.]

**శీర్షికలో పాల్గొనేవారు పాటించవలసిన నిబంధనలు.**

* వ్యాసం సచిత్ర వారపత్రికలో రెండు కాలమ్‌ల నిడివికి మించరాదు : అంటే సుమారు వెయ్యి నుంచి పదునాలుగు వందల అక్షరాలు ఉండాలి. కాగితానికి ఒకవైపే సిరాతో విడివిడిగా వ్రాయాలి.
* రచయిత్రి యిటీవల తీయించుకున్న చిన్న ఫోటో, స్వీకరింపబడని రచన తిప్పి పంపేటందుకు స్వంత చిరునామా గల తపాలాబిళ్ల అంటించిన కవరు జత చేయాలి. పోస్టేజీ లేని రచనలు ఎంత మాత్రం స్వీకరింప బడవు.
* ఈ శీర్షిక కేవలం వనితాలోకం సమస్యల చర్చావేదిక మాత్రమేగాని పోటీ గాదు కనుక ముగింపు తేదీ లేదు.
* వ్యాసం ఎంపిక విషయంలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు.

[మీ రచనలు కవరుమీద ఈనాటి వనితాలోకం శీర్షికకు అని వ్రాసి ఎడిటర్, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ—3 అన్న చిరునామాకి టపాలో పంపాలి. వ్యక్తులపేర రచనలు పంపకూడదు.]

ఈ శీర్షికలో వనితలు విరివిగా పాల్గొని జయప్రదం చేస్తారని ఆశిస్తాము.

సం॥

# వంటలు

## గసగసాలతో హల్వా

కావలసిన వస్తువులు :— 1 గ్లాసు గసగసాలు, 2 గ్లాసుల పంచదార, 3 గ్లాసుల నెయ్యి. తయారుచేయు విధానము:— మొదట ఒక గ్లాసు గసగసాలను రోటిలో వేసి కొన్ని నీళ్ళుపోస్తూ చాలా మెత్తగా రుబ్బుకోవాలి. (గసగసాలను కాటుకలా మెత్తగా రుబ్బాలి) ఈ విధంగా చేస్తే గసగసాలు మెత్తగా ఒక ముద్దలా తయారవుతుంది. ఇలా తయారైన ముద్దను ఒక పళ్ళెము నందుంచుకోవాలి. ఒక గిన్నెలో 2 గ్లాసుల పంచదారను తీసుకొని $\frac{1}{8}$ గ్లాసు నీళ్ళను పోసి ఆ గిన్నెను పొయ్యిమీద ఉంచి కంబీపాకం వచ్చునంత వరకూ గిన్నెలోని పంచదారను గరిటతో కలుపుతూ ఉండాలి.

తరువాత పళ్ళెము నందుంచిన గసగసాల ముద్దను ఈ పాకం గిన్నెలో వేసి కలపాలి. 7 లేక 10 నిముషాలైన తరువాత గిన్నెలోని చక్కెర పాకం చాక్‌లెట్ రంగుగా మారుతుంది. తరువాత మూడు గ్లాసులు బాగా కాగిన నెయ్యిని (వేడినెయ్యిని) చక్కెర పాకం గిన్నెలోనికి 3 లేక 4 సార్లు కొద్ది కొద్దిగా వేస్తూ బాగా కలపాలి. ఇలా చేసినప్పుడు మంట ఎక్కువగా ఉండకూడదు. ఇక అయిదు నిముషాలైన తరువాత నెయ్యి బాగా అంటించిన ఒక పళ్ళెమునకు ఈ గసగసాల హల్వాను పోయాలి

ఒకసారి చేసి తింటే మరలా, మరలా తినేలా చేస్తుంది ఈ రకం హల్వా

— కె.జి. హేమలత

# విదేశ వ్యాపారంలో సమర్థులకే జేజేలు!








భూమిమీదనేమి, సముద్రంమీదనేమి, వేలాది కిలోమీటర్ల దూరం ఆస్బెస్టాస్ సిమెంట్‌షీట్లు పయనించవలసి వుంటుంది; అంతేకాదు విదేశ వ్యాపార రంగంలో గట్టి పోటీకి తట్టుకోవలసి వుంటుంది. రెండు విధాలుగాకూడా రామ్కో విజయం సాధించి, జేజేలను అందుకొన్నది. అత్యంత జాగరూకతతో చేసే ప్యాకింగ్ ఫలితంగా సరుకు మొత్తం అతి భద్రంగా గమ్యస్థానాన్ని చేరుకుంటుంది. మధ్యప్రాచ్య దేశాలతో కేవలం 18 మాసాలలో పదిలక్షల డాలర్ల వ్యాపారం జరగడమే రామ్కో సరుకు ఉత్కృష్టతకు ప్రత్యక్ష తార్కాణం.

రామ్కో షీట్లు కొన్నపుడు, కొనుగోలుదార్లకు ఏదో సిమెంటుషీట్లు కొన్నట్లుమాత్రమే కాదు; పరిపూర్ణమైన శాశ్వత సంరక్షణను వారు కొంటున్నారు.

**Ramco** ఆస్బెస్టాస్ సిమెంటుషీట్లు మరియు తత్సంబంధ వస్తువులు

**సదర్న్ ఆస్‌బెస్టాస్ సిమెంటు లిమిటెడ్**

150A/2, అణ్ణాశాలై, మద్రాసు-600 002.

బ్రాంచీలు : బెంగుళూరు, కొచ్చిను, విజయవాడ, హైద్రాబాదు,

ఫ్యాక్టరీ : అరక్కోణం (తమిళనాడు) కరూరు (కర్నాటకము)

సంపూర్ణ వినియోగదార్లు : రాజా ధర్మస్థాపనము



ACH. SAC 3 TE 78

# ఏలుకో...ఏలుకో


(16వ పేజీ తరువాయి)


ఈ గుప్త జ్ఞానాన్ని పెద్ద కుటుంబాల వాళ్లు తెలుసుకుంటే కమల నీటిలో మునిగిపోదు. కలకలలాడుతూ విలాసంగా నీటిలో ఊగుతూ, తేలుతూ ఉంటుంది.

వింతమంది కథలకి నాయకినైనానో, నా కన్నీళ్లూ, నా బాధలూ, వాళ్ళు చూసి ఊహించినట్లు పోజుపెట్టి రాస్తారు. నిజంగా అడగండి— పీలికల్లో దాచుకోలేని బిచ్చగత్తె పడుచు దనం చూసి 'ముచ్చట' పడనిదెవరు? రూపాయిన్నర టిక్కెట్టుకొని నా పక్కకొచ్చి కూచునే బూచిబుర్ర వడగండి! వాడు వెదికేది, ఎదురుగా కంటికి కనపడుతున్నవి. పక్కచేతికి అందుబాటులో ఉన్నవి. అన్నీ వంపులే.

మన వీధి రోడ్డు ఆ చివరనుంచి ఈ చివర వరకూ నాలుగుసార్లు తిరిగితే నేను రెండున్నర కథలకు మెటీరియల్ ఇస్తాను. వెధవ పరీక్షంటే పోతోందికాని, నాకేం తక్కువ— నేను రచయితలకి గోల్డ్‌మైన్‌ని పరీక్షల్లో మార్కులంటే రాలేదుకాని, నాకు కావలసిన జ్ఞానం నేను సంపాదించుకున్నాను. నూటయాభై రెండు నవలలూ, ఎనిమిదివందల యాభై మూడు కథలూ కాచివడపోశాను మూడు నవలలకి ప్లాట్లు ఫిక్సరసైజు పుస్తకాల్లో రాసుకున్నాను. ఇక కథలా, నా తలనిండా అవే! —చేతిలో పుస్తకం— వార పత్రిక, మంత్లీ, బొమ్మలున్నవి, లేనివి, ఏదైనాసరే— చేతిలో పుస్తకం ఉన్న కుర్రాళ్లందరితోనూ మంచిచేసుకుని మాటాడాను. పుస్తకాలు పుచ్చుకున్నాను తరవాత తరవాత దులిపి మరీ ఇంట్లోకి తీసుకువెళ్ళడమూ నేర్చుకున్నాను. కళ్లలో నీళ్ళు తిరగకుండా చెవులకు ఆ కథలు అడ్డం పెట్టుకునే చదివేదాన్ని తరవాత కడుపు నిండా చీవాట్లు తినేదాన్ని. మాష్టారూ, మీరు రచయితైతే నా బాధని ప్రజల కర్థమయ్యేటట్లు రాయగలిగేవారేమో!

—అక్క ఏమంది? నాకు మరి తెలిసే అవకాశం లేదు.

''రంకుముండ సంగతి నాకు ముందే తెలుసు'' అని అంటుంది హేమలతమ్మగారు. ఏమిటో పాతకాలం మనుషులు వాళ్లు చెయ్యలేకపోయిన పని ఎవరు చేసినా ఆగ్రహమూ, అసూయా— ఏదో తెలియకుండా, తెలుసుకోవాలనయినా తెలియకుండా, సతమతమయ్యే మూగజీవాలు. వాళ్ళంటే నాకు బోల్డు జాలి.

కథలు రాసే వెంకటరమణమూర్తికి నేను ఆదాయాన్ని ఖర్చు కథలు రాశాడు నామీద, రక్తం ఉడుకులెత్తేట్లా, ఒళ్ళు జలదరించేలా సెక్సీసీన్లు కుమ్మేసి నన్ను ఆలిచిప్పలా అరగదీసేశాడు. మనియార్డర్లూ, చెక్కులు వాడివి. అరిగిపోవడం నాది.

నాకు చదువు మరి వంటబట్టదు మాష్టారూ! పాఠశాలలకీ, పరీక్షలకీ అతీతంగా ఎదిగిపోయాను.

మొదటిసారి బట్టలు మూట కట్టినపుడే జ్ఞానాన్ని మూట కట్టేస్తుంది నా లాంటి ఆడపిల్ల. ఇది నాలాంటి వాళ్ళు పుట్టుకతోనే సంక్రమింప చేసుకున్న శాపం.

నాకు వంటమనిషి ఉద్యోగమైనా చెయ్యాలనే ఉంది. 'నువ్ వంట చెయ్యడమా! నాన్సెన్స్' అంటాడు రంగారావ్. వంశంలో పాటు వచ్చిన వరహాలు లేకపోయినా, గంగాళంతో కొలిచదగిన గౌరవం మన వంశానికింకా ఉందని మావాళ్ళ భేషజం.

ఫీజులూ, మారిపోయిన పుస్తకాలు, ఇవన్నీ మావాళ్లకి బరువు. ఆ ఫోటో, ఈ షూటో ఇంత తిండి పడేస్తే వాళ్ళబాధ్యలనని.

ధైర్యంలేని మనుషులు. ఆత్మవిశ్వాసం లేని మనుషులు అహంకారం లేని మనుషులు నెత్తురు లేని మనుషులు.

—ఆగండి. ఇవన్నీ నాకూ లేవు. నాకేం? జీవితాన్ని ఎదిరిస్తానని వీరవీగా అనుకున్నాను. మేకవన్నె పులి రంగారావ్ అని ఎవరికి తెలియదు? పులిని బోనులో పెడదామనుకున్నాను. అడకత్తెరలో చిక్కుకన్నాను. అహం దెబ్బతిన్న ఆడపిల్లకి ఆత్మహత్య శరణ్యం. గేలంతో చేపను పడదామనుకున్నాను. కాని ఆ చేపను నేనే. గొంతుకలో ముల్లు గుచ్చుకుంది.

రంగారావ్ స్నేహం చేశాను. లొంగ దీసుకున్నాననుకున్నాను. నెల తప్పానని చెప్పాను. ముహూర్తం మంచిది కాదేమో — శివరాత్రి గంగలో దూకేయ్ సమస్య పరిష్కారమవుతుందని చెప్పి అర్ధరాత్రి సైకిలెక్కేశాడు. సంగంలో నే నెవరిని?

ఇతరులను నేను అన్న మాటలు కకావికలైన నా మనసు అదుపుతప్పి చేసిన ప్రలాపాలు. ఎంత ధైర్యంలేని మనిషిని కాకపోతే బ్రతుకు ఇలా బండలు చేసుకుంటాను?

నన్ను చూసి జాలిపడే మనిషి — నన్ను గురించి ప్రజలు దుమ్మెత్తి పోస్తుంటే విట్బ్యూర్సులు విడిచేది ఏంలొక్కరే!

తెలుగు మాష్టారి ధర్మమా అంటూ అరిషడ్వర్గాలంటే ఏమిటో తెలుసుకున్నాను. ఏమమ్మా తల్లీ, అంటూ వీపు నిమిరే ఉదారులు — కన్నీళ్లతో దాహం తీర్చుకోగలిగిన నేర్పరులు. పాపం ముసలాళ్ళు!

— పాపం అంటే నాకు భీతి లేదు. కారణం పాప మన్నది మనిషి మీద పరిస్థితులు చేసే కుట. బాధ్యతని మనిషి మీదకి నెట్టేసి, వికృతంగా నవ్వుతూ, 'నువ్ ఏ మాత్రం మనిషివి నీ తెలివి తేటలింతేనా? అని ఎగతాళి చేస్తూ ఎక్కడివక్కడ సర్దుకుంటాయి పరిస్థితులు.

లోకంలో పుణ్యాత్ములు కాదు, అవతల మనిషిని అవగాహన చేసుకోగలిగిన వారు — ఉన్నారని భగవంతుడు చూపడానికి నిదర్శనం లాంటి వాళ్ళు మీరు — ఎద్దు మొద్దు స్వరూపమైన విగ్రహాలకి ఇవన్నీ ఎలానూ చెప్పలేను. నా అక్కసంతా బయటకు వెళ్ళగక్కాలి. నా మనసు తేలిక పడాలి. అప్పుడు సులువుగా మునిగిపోగలను — చేసిన పాపం చేసినవాడు చెప్పినంత మాత్రాన పోదు — ఇతరులు అవగాహనతో దానివిూద జాలి చూపిస్తే పోతుందని నానమ్మకం.

ఉత్తరం మీకు చేరుతుందనే ఆశ. బడి పిల్లలు దైవసమానులు. ఈ బాబు ఉత్తరం కవరులో పెట్టి పోస్టు చేస్తానన్నాడు. నా పెన్ను ఆ అబ్బాయి దగ్గర ఉంటుంది శాశ్వతంగా.

ఇంత చీకటిలోనూ ప్రవాహం మిలమిలా మెరుస్తుంది. అదే సత్యం — అదే నిత్యం — పాపానికీ, పుణ్యానికీ అతీతం ఈ ప్రవాహం. నా లాంటి కమలలూ, రంగారావ్ లాంటి తుమ్మెదలూ, పాడుగు సూర్యారావ్

—మేష్టారి లాంటి కందిరీగలూ, అందరూ వో రోజా పూసి వో క్షణం తలలు ఎగరవేసి వో తృటి విరవిగి నేల కొరగాల్సిందే.

పునర్జన్మలో క్షమాపణ చెప్పకు నే

ఏలుకో...ఏలుకో

అవకాశం కోసం ఎదురుచూస్తూ.

కమల.

రామం ఉద్రేకంగా అడిగాడు రంగారావ్‌ను– కమల ఏమైందో తెలుసా అని. రామారావ్ నువ్వూ అందరిలా అపోహపడే అల్పిష్టివనుకోలేదు. నాకు సకాలంలో పెళ్ళయితే ఈ యీడు అమ్మాయి ఉండేది.'

అవాక్కయి పోయాడు రామం.

కమల రాసిన ఉత్తరంతీసి చూపించా లనుకున్నాడు కాని...రంగారావ్‌తో ఏంచెప్పి, ఏంచూపి ఏంలాభం ?

మూడు శివరాత్రులు గడిచాయి.

కడుపున బిడ్డ నలుసును ప్రసవించలేక కళ్ళు మూసింది జానకి. శివరాత్రి వస్తూనే ఉంది. ఒంటరిగానైనా దర్శనం చెయ్యటం మానలేదు రామం. "ఏమీలేని కమల ఆత్మహత్య చేసుకుంది. అన్నీ ఉన్న జానకి హఠాత్తుగా పోయింది. దుఃఖం సత్యమూ, జీవితం దుఃఖమేనా" అడిగాడు భానోజీ.

"బోధ పడనిదాని, కంతటికీ కీలకం రెండు మాటల్లో చెబుతారు మనవాళ్ళ– దేవుడిలీల" అనేశాడు రామం.

ఎప్పుడోకాని కమల గుర్తుకు రాదు రామానికి. బ్రతుకులో ఎన్నో వ్యథలూ, మలుపులూ– ఏ ఒక్కటీ నిరవధికంగా ఉండదు.

స్కూలుకు వేళవుతోంది.

"మేష్టారున్నారా?"

—కళ్ళజోడు తియ్యలేదు వచ్చినావిడ. బయట- బ్రీఫ్‌కేస్ పట్టుకుని ఒకాయన.

"స్కూల్లో కలిసినా మాట్లాడ్డానికి వీలవదని మొదటి బస్సుకే వచ్చా!"

కళ్ళజోడు తీసింది కమల.

శిల అయిపోయిందనుకున్న గుండె స్పందిస్తోంది.

"వీరు మావారు... కేరళలో..."

"నమస్కారం."

"నే రాసిన ఉత్తరం చింపెయ్యండి మాష్టారూ– బ్రతుకును అర్థం చేసుకోడానికి కూడా దైవకృపే కావాలి. ఆనాడు నాకు చెయ్యి అందించి చేదుకున్న వరు డీయనే– ఇంతకీ అక్క ఏదీ?"

—ఆమె కళ్ళలో, ముఖంలో, వెలుగు దొంతరలు మిరుమిట్లు గొలుపుతూ ఉంటే 'జానకికేం భేషుగ్గా ఉంది. పాతానికి పోయింది' అంటూ తాళంకప్ప చెవులూ పట్టుకుని లేచాడు రామం.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## ఇంద్రజాలికుడు బి. వి. పట్టాభిరావ్ :

ఒక నూలుదగ్గర నాచేతికిచ్చారు. దానిని ఒకొన ఒకొన పట్టుకొని లాగి చూడమన్నారు. లాగాను. ఒక కొస ఎడంచేతితో పట్టుకొని, మరో కొసను నా మేనల్లుడు పెనుమాళ్ళ రాజేంద్రకు ఇచ్చి పట్టుకోమన్నారు. పట్టుకున్నాడు. నా చేతికి కత్తెరిచ్చి, దారపు నడుముకు సరిగ్గా కత్తిరించమన్నారు. నా చేతులార కత్తిరించాను. రెండిటినీ గట్టిగా ముడివేశారు. మమ్మల్ని అందరినీ చూడమన్నారు. లాగి చూశాను. ముడివేసిన చోట పట్టుకొని, ఏదో పుల్లతో మూడుసార్లు అటూ ఇటూ అభిమంత్రించినట్టుగా చేశారు. చేయి తీశారు. కత్తిరించి ముడివేసిన గుర్తు కించిత్తయినా లేదు. ఇదీ శ్రీ భవరాజు వెంకటపట్టాభిరావ్‌తో నా పరిచయం ప్రారంభం. నేను చిన్నప్పుడు విప్రవినోదుల ఇంద్రజాలాలు చూశాను. వీధిగారడీ వారి గారడీలు చూసినవంటే కోకొల్లలు. విశ్వవిఖ్యాత ఇంద్రజాలికుడు పి. సి. సర్కార్ విస్మయకరమైన విద్యలూ చూశాను. నా పదవ ఏట మా కమలాపురం (బళ్ళారిజిల్లా) గ్రామంలో మోడీ వేయడం చూశాను. ఒక మైదానంలో వేలమంది గుమిగూడారు. మోడీవాళ్ళు హై హై కేకలు వేస్తూ, వేపాకు మండలు విసిరారు. వేపాకులన్నీ మంత్రదబ్బలుగా మారాయి. నా పక్క జేబులోను ఒక మంత్రదబ్బ. వెనక్కి చూశాను. పక్కా విడ కంచుకంలో మంత్రదబ్బ. ఒకే గందరగోళం. కేకలు, అరుపులు, ఆర్తనాదాలు. రెండు నిముషాలు గడిచాయి. మంత్రదబ్బలన్నీ వేపాకులయ్యాయి. ఈ సంగతి చెప్పాను శ్రీ పట్టాభిరావ్‌తో. అవును మేము వాటి (ని) సంగతి విన్నాము. కాని, చూడలేదు. మేము, ఎంత సరంజామాతో మూడు వైపులా యవనికలు దించిన రంగస్థలంపై మ్యాజిక్ చూపుతున్నాము. కాని, నడిరోడ్డు మీద, ఎలాటి మరుగూ లేక, మోడీలు, గారడీలు చేసే వారి హస్తలాఘవమే గొప్పది. నిజంగా వారు గొప్పవారు అన్నారు ఆయన. పట్టాభిరావ్ చూపే ఇంద్రజాలంలో జనాన్ని దిగ్భ్రాంతి కల్గించే వాటర్ ఆఫ్ ఇండియా, బ్లేడులు నమలడం, డెవిల్స్‌బాక్స్, రూపాయనోట్ల ముద్రణ, మనిషిని నిలువునా చీల్చి అతికించడం, కళ్ళకు గంతలు కట్టుకొని మోటార్ సైకిలు నడపడం, సమ్మోహితులను చేయడం వంటివి ఎన్నోవున్నాయి. వాటర్ ఆఫ్ ఇండియా అనేదానిని మనం భరతతీర్థం అందాము. ఒక చిన్న గిన్నె ఉంటుంది. దానిని ఆయన వంచితే సంతత ధారగా నీరుపడుతూంటుంది. డెవిల్స్ బాక్సునుంచి పుష్పాలు ఫలాలూ మనకు లభిస్తాయి. ఆయన రూపాయనోట్లు గంటసేపు ఉంటాయి. తర్వాత తెల్లబడిపోతాయి. పట్టాభిరావ్ ఇంతవరకు ఆరువందల ప్రదర్శనలిచ్చారు. ఇటీవల తుఫాను బాధితుల సహాయం కోసం ప్రదర్శనంలో 17 వేల రూపాయలు వసూలుచేసి యిచ్చారు. ఇలా సంఘసేవాసంస్థల కోసం ఉచిత ప్రదర్శనలివ్వడమే ఎక్కువ. ఇంద్రజాలం వినోదం కల్గించే గొప్పవిద్య. దీనిని స్వార్థానికో, క్షుద్ర ప్రయోజనాలకో వినియోగించుకోవడం నాకు ఇష్టంలేదు — అన్నారు ఆయన. పట్టాభిరావ్‌కు చిన్ననాటినుంచే ఇంద్రజాలంలో అభిరుచి ఉంది. చిన్నప్పుడు అమీర్‌పేట హైస్కూలులో 8వ తరగతి చదువుతున్నప్పుడు, మ్యాజిక్ నేర్చుకొన్నారు. ఒకరూపాయి యిస్తే ఒక ట్రిక్ చెబుతానన్నాడట ఒక ఇంద్రజాలికుడు. అలాగే కొన్ని నేర్చుకొన్నారు. 15వ ఏట (1963) పట్టి చేతులతో రూపాయి తెప్పించడం వంటివి చేసి చూపారు. కాకినాడలో బి. ఎల్. చదువుతున్నప్పుడు ఎంబార్‌రావు అనే వారివద్ద నేర్చుకొన్నారు. పి. సి. సర్కార్ వద్ద శుశ్రూష చేసి మెలకువలు నేర్చుకొన్నారు. ఆయనకిది వినోదం. పట్టభద్రుడైన తర్వాత సనత్‌నగరిలోని ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియాలో చేరారు. పని చేస్తున్నారు. మొన్న ఫిబ్రవరి 12కు ఆయనకు 27 సంవత్సరాలు నిండాయి. భరత్ మేజిక్‌సర్కిల్‌కు ప్రధాన కార్యదర్శి, అమెరికన్ 'మేజిక్ అసోసియేషన్'లో సభ్యులు. ఇంద్రజాలికులలో అత్యల్ప వయస్కులు ఈయన. తెలుగులో ఇంద్రజాలం గురించివ్యాసాలు వ్రాసిన వారిలో మొదటివారు ఈయన. జిజ్ఞాసువులకు ఉచితంగా మేజిక్ నేర్పుతారు ఆయన. ఇంద్రజాలం భరతదేశంలో పుట్టింది. దానికి తిరిగి మంచి ప్రతిష్ఠ సంపాదించాలి అనేది ఆయన సంకల్పం. దానిపై విద్యార్థులకు శ్రద్ధ కలిగించడానికి ఆయన ఉత్సాహపడతారు. పట్టాభిరావ్ నాయనగారు శ్రీ భవరాజు సత్యనారాయణ. 85 సంవత్సరాల పండుముదుసలి. వారి సోదరులలో అందరూ ప్రసిద్ధులే. ఒక శ్రీ బి. వి. సత్యమూర్తి, వ్యంగ్య చిత్రకారులు. మరొక శ్రీ రమణరావు, అసిస్టెంట్ డ్రగ్ కంట్రోలర్, శ్రీ పట్టాభిరావ్‌కు ఒక ముద్దుల మూటగట్టే పాపడు. అయితే శ్రీ సత్యసాయిబాబా చూపే మహత్యాలు ఏమిటి? అడిగాను. అది గారడీకాదు. గారడీమాయ, అనిత్యం. దానిజీవితం కొన్ని గంటలు. శ్రీ సాయిబాబా ప్రసాదించే వస్తువు చాలాకాలం ఉంటున్నది. కనుక గారడీకావు, అన్నారు పట్టాభిరావ్. ఇంద్రజాలికుడే చెబుతున్నప్పుడు నమ్మడం మంచిది. శ్రీ పట్టాభిరాం ఇక కనీసం మూడు ఇరవై యేడేళ్ళు ఇంద్రజాలంతో ఆంధ్రావళిని సంతోషపెడుతూ, భరతీయేంద్రజాలానికి పూర్వపు అపూర్వత్వం కలిగిస్తారని విశ్వసిస్తున్నాను. విశ్వాసం కొండనైనా కదుపుతుంది.



ఇంద్రజాలికుడు
భావరాజు వెంకట పట్టాభిరావ్

## కళాస్రవంతి ప్రారంభోత్సవం :

ఆదాయపు పన్ను సిబ్బంది వారు నెలకొల్పిన కళాస్రవంతి సాంస్కృతిక సంస్థకు ప్రఖ్యాత చలనచిత్ర నటుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ఫిబ్రవరి 19న జవహర్‌లాల్‌భవన్ ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియంలో ప్రారంభోత్సవం చేస్తూ, ఎందరి పాపాలో క్షాళనం చేసే, రోజంతా పనిచేసే, అలసిన వారి మనో వినోదానికి ఇలాటి సంస్థలు అవసరమన్నారు. కళాసేవ తమ లక్ష్యమని దైవం కన్నా ఆనందదాయకం లలితకళలన్నారు. అధ్యక్షత వహించిన ఆచార్య డాక్టర్ రామరాజు దైవం 'కళ ఒకటేనని, మంచి పనులు చేయడానికి ఇలాటి సంస్థలు ఎప్పుడైనా కావాలని అన్నారు. కళాస్రవంతి ప్రధాన పోషకులు శ్రీ పి. సుందరరామిరెడ్డి తమ సంస్థకు త్వరలో సొంతభవనం ఏర్పాటు చేయనున్నారు. ప్రారంభంలో అసిస్టెంట్ కమిషనర్ శ్రీ సి. సత్యనారాయణ స్వాగతం చెప్పారు. శ్రీ ప్రసాద్ ధన్యవాదాలు అర్పించిన మీదట, కుమారి మమత నృత్యం, హైదరాబాద్ ఫిలిం టాలెంట్స్ సిలో లలిత సంగీతం, కళాస్రవంతి తిరుపతి నాటకం ప్రదర్శించారు.

## తెలుగులో గవర్నర్ ప్రసంగం :

తెలుగు అకాడమీ ప్రచురించిన ఇంగ్లీషు — తెలుగు నిఘంటువును గవర్నర్ శ్రీమతి శారదా ముఖర్జీ ఫిబ్రవరి 16వ తేదీన ఆవిష్కరిస్తూ, తెలుగులో తమ ప్రసంగం చదివి శ్రోతలను ఆశ్చర్యానందాలతో ముంచెత్తారు. తెలుగు అంటే తమకు ఎంత ప్రీతి అని, నేర్చుకుంటున్నానని ఆమె అన్నారు. విద్యా మంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు అధ్యక్షత వహించారు. అకాడెమీ డైరెక్టర్ శ్రీ ఎస్. వి. జోగారావు స్వాగతం చెప్పారు.

(49వ పేజీ చూడండి)






# వారఫలం

మహేష్

## 17-3-1978 శుక్రవారం మొదలు 23-3-1978 గురువారం వరకు

**మేషం :—** సంతోషకరమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగించగలదు. ముమ్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. ప్రయాణాలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనుకూలమైన సమాచారం అందగలదు.

**మిథునం :—** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**కర్కాటకం :—** మీ తాలూకు వస్తువులు పోవచ్చును వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు యేర్పడతాయి.

**సింహం :—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వారం ఆఖరులో అనుకూలత లభించగలదు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభించగలదు. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**తుల :—** వృత్తివ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. సాహసిక వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**వృశ్చికం :—** చేతికి వచ్చిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. మీకంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**ధనుస్సు:—** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. పోటీవారిలో గౌరవం లభిస్తుంది.

**మకరం:—** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. ప్రయాణాలు ఫలిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకుంటారు. వారం ఆఖరులో ఫలితంలేని శ్రమ కలుగుతుంది. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అడంబరం కి పం వ్యయం జరుగుతుంది.

**కుంభం:—** సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సాహసిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**మీనం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ఇతరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు— పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి

### ప్రాగుబోతు – తిరుగుబోతు

నాటకం. రచన : అభ్యుదయశ్రీ 120 పేజీలు. వెల : అయిదు రూపాయలు. ప్రతులకు : ది గ్లోబెట్రాటర్స్ ఆర్ట్స్ థియేటర్స్ (రిజిస్టర్డ్), బాలా రావుపేట, తెనాలి- 522 202.

### ఊరుమ్మడి బ్రతుకులు

నాటకం. రచన : శ్రీ సి. ఎస్. రావు. తెలంగాణా, రాయలసీమ మాండలికాలలో శ్రీ పోరంకి దక్షిణామూర్తి. మొత్తం 120 పేజీలు. వెల : నాలుగు రూపాయలు. ప్రచురణ : ఆదర్శగ్రంథమండలి, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

### వెలుగు

నటరాజ కళానికేతన్, వేములవాడ (జిగ్నేశ్ల శాఖ) వారు ప్రచురించిన కవితా సంకలనం. ఇందులో పలువురు రచయితల కవితలు ఉన్నాయి. 40 పేజీలు, వెల : రెండురూపాయలు. ప్రతులకు : నటరాజ కళానికేతన్, సాంస్కృతిక సమాఖ్య, వేములవాడ, కరీంనగర్ జిల్లా.

### ఆమె వితంతువు కాదు

ఇవన్నీ చదువుతే చచ్చిపోవా? అన్న 32 పేజీల పీటికతో రచయిత శ్రీ రేగులపాటి కిషన్‌రావు వ్రాసిన 84 పేజీల నవల. వెల : నాలుగు రూపాయలు. ప్రతులకు : రచయిత పేర కిషన్‌దాస్ ఎల్లారెడ్డిపేట—505 303, సిరిసిల్ల తాలూకా, కరీంనగర్ జిల్లా.

### కళ్ళు తెరవండిరా

నాటిక. రచన : శ్రీ సి. ఎస్. రావు. 34 పేజీలు, వెల : రెండు రూపాయలు. ప్రచురణ : ఆదర్శ గ్రంథమండలి, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## హైదరాబాద్ నోట్‌బుక్

(47 వ పేజీ తరువాయి)

**మానవతావాది కృష్ణశాస్త్రి :**

కవితామూర్తి శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిని వంశీఆర్ట్స్ థియేటర్ ఫిబ్రవరి 19న రవీంద్రభారతిలో సన్మానించి తనను తానే సన్మానించుకొంది. నవ్యకవితా ప్రస్థానాచార్యులు ఆచార్య రాయప్రోలు సుబ్బారావు సంస్థ తరపున శ్రీ కృష్ణశాస్త్రిని సన్మానించారు. అధ్యక్షత వహించిన డాక్టర్ పి. నారాయణరెడ్డి పాట ఆత్మను కనుగొన్న వారు శాస్త్రి అనగా, డాక్టర్ అరిపిరాల విశ్వం శ్రీ శాస్త్రి అనుభూతి వేదాంతి, కన్నీటి వేదాంతి అని ప్రశంసించగా, పాటలు వ్రాయడంలో సూత్రం తెలిసిన వారని పాలగుమ్మి విశ్వనాథం అభివర్ణించగా, శ్రీ శాస్త్రి మానవతావాది అని జేసేసు చెప్పగా, సంగీతం వినిపిస్తే, సౌరభ్యం వినిపిస్తే అదే కృష్ణశాస్త్రి అని నండూరి విఠల్ విసుతిరపగా, సన్మానం వైభవోపేతంగా జరిగింది. మంచిమిని దగ్గరికి రానీను అని కృష్ణశాస్త్రి వ్రాసిన నవమాధానాన్ని అయ్యగారి హేమలత చదివి వినిపించారు.

**ఉపశ్రుతి :**

ఈ సినిమా వాళ్ళంతా అంతే డబ్బు తీసుకుంటూ కళాసేవ అంటారేమిటి సార్? అడిగాడు ఒక అమాయకుడు. ఎన్ని రాజకీయ నాయకులు మంత్రులయి ప్రజాసేవ చేస్తారు ప్రధాన క్రమముఖులు అన్ని విధాల అన్నింటిని సంఘసేవ చేస్తారు. పండితులు కవులు పెద్ద పదవులు, సన్మానాలు పొంది, భాషాసాహిత్య సేవ చేస్తారు. డబ్బు తీసుకున్నంత మాత్రాన సేవకాకుండా పోతుందా? అన్నారు ఒక పెద్ద మనిషి.

## టమోటో సూప్

కావలసిన వస్తువులు : టమోటోలు ఎర్రగా పండినవి 10, బంగాళాదుంపలు 3, ఉల్లిపాయలు 4, పచ్చిమిరపకాయలు సుమారుగా 7 లేక 8, పచ్చిబటానీలు ఒక కప్పు సరిపడా.

తయారుచేయు విధానము: టమోటోలు నీళ్లలో పోసి స్టవ్ మీద పెట్టి మెత్తపడగానే దింపివేసి తొక్కు తీసెయ్యాలి. తరవాత కండ తొక్కులతో సహా బాగా నొక్కి తొక్కు, కండ గింజలు పడకుండా వడబోసెయ్యాలి.

బంగాళాదుంపలు, పచ్చిమిరపకాయలు విలువుగా తరిగి వుంచుకోవాలి. ఉల్లిపాయలు చక్రాలుగా తరగాలి, బటానీలు ఉడికించి వుంచుకోవాలి. ఉల్లిముక్కలు, పచ్చిమిరప, బంగాళాదుంప ముక్కలు నూనెలో విడిగా వేయించుకోవాలి.

తర్వాత మూకుడులో ఈ రసం పోసి ఈ వేగిన ముక్కలు, బటానీలు కూడా వేసి కొద్దిగా నీరు కూడా పోసి సరిపడా ఉప్పు. చిటికెడు పంచదార వేసి రెండు పొంగులు వచ్చి జారుగా అవగానే ఒకస్పూను కారం వేసి దింపెయ్యాలి.

వెడల్పు బేసినులో దీనిని పోస్తే ఎర్రటి రసంలో తెల్లగా, పచ్చగా ముక్కలు తేలుతూ చూడడానికి కంటికి ఇంపుగా తినటానికి కమ్మగా రుచిగా వుంటుంది. ఇది పూరీ, చపాతీలలోకి చాలా బాగుంటుంది.

— చిత్రపు లక్ష్మి

త్వరలో

ఇలా ఎందుకు జరిగింది!

సీరియల్



## ఉత్తరాలు

(6 వ పేజీ తరువాయి)

### సినిమా

మీ (మా) అభిమాన పత్రిక ముఖచిత్రము హిందీనటి మీనాక్షి బాగులేదని చెప్పుటకు విచారిస్తున్నాము. కథలల్లో వెలుగొస్తుంది కథ చాలా బాగుంది. రాగ మాలిక సీరియల్ పత్రికకే హైలైట్ ముఖ చిత్రములు, తెలుగు నటీనటులది వేస్తే బాగుంటుందనినాఅభిప్రాయము.

కె. వసంత (విశాఖపట్టణము)

### ఫాల్గుని డైరీ

17—2—78 తేది ఆంధ్ర సచిత్ర వార పత్రిక ముఖ చిత్రం వాణిశ్రీ ముమ్మ ర్తింతో ఆకర్షించింది. రాగమాలిక సీరియల్ మమ్ములను ఎంతో ఆహ్లాద పరుస్తున్నది. ఈ వారములో కార్టూన్ చాల తక్కువగా వేయుచున్నారు. జి. వి. జి. పేజీ చాల బాగు న్నది. డాక్టర్ సలహాలు శీర్షికను ఒకపేజీ వేయ వలయునని కోరుచున్నాము. ఈ వారములో ఫాల్గుని డైరీ చాల ఎక్కువగా వేసినందుకు చాల సంతోషించుచున్నాము. మీ (మా) పత్రిక కోసం ఎప్పుడు ఎదురు చూచుచునే ఉన్న మీ పాఠకులు.

ఎ. నాగరాజనాయుడు (కరణావాండ్ల పూరు)

### కథలు

3—3—78 పత్రికలోని చంద్రశేఖరం గారి కథ అర్థంకాని సంగతి చదివాక ధన్య వాదాలు తెలుపుకుంటూ ఉత్తరం వ్రాయకుండా వుండలేకపోయాను.

ఇంత మంచికథను ప్రచురించినందులకు మీకు ధన్యవాదాలు.

మహమ్మద్ రవూఫ్, (మంగళగిరి)

* * *

17—2—78 తేది పత్రికలో ముగిం చిన పూర్తికాని డైరీ కథ నా హృదయాన్ని కదిలించివేసింది. 3—3—78 తేది పత్రికలో వచ్చిన అర్థముకాని సంగతి కథ చాల బాగుంది. ఈ రెండు కథలు నా కళ్లలో నీరు నింపింది. ఇలాంటి మంచి కథలు వేసిన మీ (మా) పత్రికకు, ఆ రచయితలకు నా యొక్క కృతజ్ఞతలు ఏడు సంవత్సరములుగా నేను ఈ పత్రికను అలవాటు తప్పకుండ చదువు ఒక పాఠకుని నా ఈ ఉత్తరమునకు పత్రికలో చోటు వుంటుందని ఆశిస్తున్నాను.

వి. ఆర్. విజయబాబు, (మద్రాసు)

### సీరియల్

17—2—78 వ తేదిన వెలువడిన ఆంధ్ర సచిత్రవారపత్రిక ముఖచిత్రం వాణిశ్రీ చూడటానికి ఎంతో ముచ్చటగావున్నది. రాగమాలిక సీరియల్ కథ చాలా బాగా వడు స్తుంది. రాగమాలిక కథ చదువుతూ వుంటే ఎక్కడో దేవేంద్ర లోకంలో విహరిస్తూ వున్న ట్లుంది. రచయిత మాధవ పెద్ది పుణ్యశీలా ప్రసాద్‌గారికి ప్రచురించిన మీకు నా యొక్క ధన్యవాదాలు.

అంతే కాక జి. వి. జి. గారిపేజీ మమ్మల్నెంతో ఆకర్షించింది. మీ మా, పత్రికకోసం ఎప్పుడూ ఎదురుచూసే పాఠకుల్లో నేనూ ఒకన్ని.

షేక్ బారాయిమహాన్ (యోరువారిపల్లె)



### గమనిక

గేయాలు పంపేవారు వాటిలో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.

Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna

# ఊరికాపొంపు..... అమర్



విశ్వవిఖ్యాత సిటిబస్ సార్వభౌమకూ..
జిందాబాద్
జై
విజయవాడ (బెజవాడ)
మా ఊళ్ళో సిటిబస్‌లూ ప్రయాణం చేసి సేఫ్టీగా తిరిగొస్తే ఇలా సన్మానం చేస్తారు




విశాఖపట్నం (వైజాగ్) (వాల్తేరు)
ఒరేయ్! మా ఊళ్ళో మిట్టపల్లాలెక్కువ కాస్త జాగ్రత్తగా సైకిలు తొక్కు—
ఆసంగతి కాస్త ముందు చెప్పకూడదూ! నా సైకిలుకి బ్రేకుల్లేవు.




మా ఊర్ని "ఆంధ్ర పేరిస్" అంటారు తెల్సా?!
తెనాలి..




క్యా? భయ్యా కహాఁ సే ఆతే హై??
ఆవో
మేరీ ఆటో మే ఆయియే!
హైదరాబాదు (ఆంధ్రుల రాజధాని)
BUS STAND
ఆయియే!
కహా! జానా చాహతే హై?!
నాకు హిందీ రాదే.. ఖర్మ.. ఏమిటి చెయ్యాటం?!




ఈ అద్దం దాలాం చవగ్గా వచ్చిందని "మద్రాసు" మూర్ మార్కెట్లో కొన్నానోయ్!




సార్! సార్!! తద్దినం పెట్టించాలా!
మాసికం పెట్టించాలా
దినవారం చెయ్యాలా!
కాశీ
రెండూ ఒకే సారి పెట్టిస్తే కన్సెషన్
అబ్బబ్బ! ఉండుండయ్యా మేమిద్దరం పెళ్ళి చేసికోటాని వచ్చాం!